# అంకితము.



గీ. తల్లిదండ్రులకుం గాని । తనుజుఁ డెందు
దనుజుఁ డనియాడు రామాట । తథ్యమగును;
తల్లి హెచ్చని యెంచి స । ద్భక్తితోడ
నామె కొసఁగితి నీగ్రంథ । మంకితముగ.

గ్రంథకర్త.



(ఐతిహాసిక నాటకము)

వారణాశి భానుమూర్తిగారు

గ్రంథకర్త.

Registered

Note this




Trade mark

విలువ రూ 1 0-0.

(Postage extra)

పోస్టుఖర్చులు కొనువారే భరింపవలెను.

గమనింపుడు:— అడ్వాన్సుగా, బంపిన చందాదారులకు, పోష్టుఖర్చులు మేమే భరించి పంపుదుము. చందాదారుల కిది చాల లాభకరము.

సంపాదకులు:—ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు.

ప్రకాశకులు:—భాగవతుల నృసింహాశర్మగారు.

వేగుంజుక్క గ్రంథమాల,

పూడిపెద్దివారివీధి, బరంపురం (గంజాం.)

*Published by:*—**Bh. N. Serma,**

VEGU-JUKKA SERIES,

Pudipeddivari Street, BERHEMPUR,

*(Ganjam)*

*Printed by:*—**Cocanada printing works,**

COCANADA.

**1ST ADITION**

**1000 COPIES.**

**1927**

Intimation for next issue "Chapala"
a high Class Detective Novel with wonderful incidents.

భాగవతుల నృసింహశర్మ

ప్రొప్రయిటరు,

వేగుజుక్క గ్రంథమాల,

పూడిపెద్దివారివీధి, బరంపురం (గంజాం)

అడ్వాన్సు పంపువారికి ఖర్చులు మేమే భరించి పంపుదుము. చందాదారులు గమనింపవలెను.

అవసరము లేనివారు వెంటనే తెలియఁజేయఁ బ్రార్థితులు.

రాబోవునవల కిదియే ఇంటిమేషను.

## చపల.

అత్యద్భుత కథాసంవిధానముఁ గల్గిన నిరూపక నవల.

గ్రంథకర్త :—పండిత ఆదిభట్ల తరిణయ్యాసిద్ధాంతిగారు.

ఇట్టిది మనభాషయందు వెలువడి యుండబోదు. వంగీయ పత్రికలన్నియు దీనిని బహుభంగులఁ బ్రశంసించినవి. ఇందు ముగ్గురు రహస్యపరిశోధకులు, ముప్వురు నాయకులు, ముప్వురు నాయికలు, మూఁడస్త్రములు, ముమ్మారు ప్రయోగము, మూఁడుహత్యలు, మూఁడు పలాయనములు, మూఁడు జాబులు, మూఁడు హింసలు, మూఁడు ప్రవృత్తులు, మూఁడు పూర్వవృత్తాంతములు, నవనీత కోమలాంగియగు మ్లేచ్ఛస్త్రీ చాంగ్‌బీబీ గావించిన పైశాచికకృత్యము

లు, నరరాక్షసుఁడగు శశిభూషణుని దుర్దాంత వ్యాపారములు. వ
చిన కాంతను నిరాకరించుట, ఒల్లని యబలను బలాత్కరించి వివ
హమాడుట. పెండ్లిలో బెద్దపెండ్లి. నిద్రలో దీర్ఘనిద్ర. కొత్తపెండ్లి
కూతురు మగనిని జంపినట్లు నిర్ధారణ, వింత దొంగతనము, దొం
నోట్లను సృష్టించుట, అబల దానవియగుట, మనుజుఁడు రాక్షస
డగుట, అనుమానము, పెనుభూతము, మోసము, అవిశ్వాసము, ప్రే
మ, పరాభవము, దంభము, వేషము, హెచ్చరిక మొదలగు విషయ
ములతో నిండియుండును. దీనిని జదువ నారంభించినంతనే, ముగించు
వఱకు నిద్రాహారములం దభిరుచి యుండదు. గ్రంథము నీతిబోధ
కము, ఉద్వేగపరిపూర్ణము, కౌతూహలాక్రాంతము పాపవ్యక్తీకర
ణము, పాప విపాక సమాప్తము.

శైలి సులలితము, సలక్షణము.

దీనివెల చందాదారులకు రు. 1-0-0. ఇతరులకు రు. 1-8-0

పోస్టేజి కొనువారే భరింసకొనవలెను.

ఇట్లు విధేయుడు,

భా॥ నృ॥ శర్మ

"వేగుజుక్క" గ్రంథమాల.

N. B 1 మేము పంపిన పార్సెలుపై "రిజిష్టరు ట్రేడుమార్కు" (Registered trade mark) గమనించుచుండవలెను.

2 చిరునామాలు మారినప్పుడు వెంటనే తెలియజేయవలెను.

3 ఇంటిమేషను అందినవెంటనే గ్రంథ మవసరములేనివారు వెంటనే తెలియజేయవలెను.

# మనవి



ఆంధ్రసోదరులారా!

దేశాభిమానులగు వారలెల్లరు, శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారి నాటకరత్నములు, తప్పక చదువవలెనను తలంపుతో నే నీనాటకము ననువదించితిని. శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారి నాటకములలోఁ బ్రతిజ్ఞాచాణక్య నామాంతరము చంద్రగుప్తము, నూర్జహాను నాటకము ప్రసిద్ధికెక్కినవి.

నే నీనాటకము రెండుమాఱులు విరచింపవలసి వచ్చినది. తొలుతటి ప్రతి యేమైనదో సంపూర్ణముగ మఱుమ న్నాంధ్రలోకమునకుఁ దెలియఁజేయఁగలను. గ్రంథవిస్తరభీతిచే, వేగుఁజుక్కవారు సమ్మతింపకపోవుటచే, నే తదంశముఁ గూర్చి యిప్పుడు వివరింపఁజాలను.

వేగుఁజుక్క పరిషన్మండలివారు, నా యీద్వితీయమాతృకను సొంతముగఁ బఠించి, యీవిధముగఁ బ్రకటించినందులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. నే నీగ్రంథమును సర్వస్వామ్యసంకలితముగ వేగుఁజుక్కగ్రంథమాలాధికారులకు బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారి కొసంగితిని. తత్ప్రతిఫలము నాకు ముట్టినదను సంతోషమిందుమూలముగ వెల్లడించుచున్నాను.

ఈనాటకముఁ బఠించి, ఆంధ్రసోదరులు, మంచిచెడ్డల నాకెఱింగించిరేని భాషాసేవకుఁ బ్రోత్సహించువారౌదురని మనవిచేయుచున్నాను.

ఈనాటకదృశ్యములలో నచ్చటచ్చటఁ గల ముఖ్యములగు పద్యములు, ప్రతిజ్ఞాచాణక్య, తులసీరామాయణాది గ్రంథకర్తలగు బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారివని యెఱుంగవలెను.

పంతముచే నే నీనాటకమును పదిదినములలోఁ బూర్తిఁజేయవలసి వచ్చుటచే నందందు లోపము లుండవచ్చును. మహాశయు లెఱింగించిన, ద్వితీయముద్రణమున సవరించుకొనఁగలవాఁడను.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
వారణాశి భానుమూర్తి
గ్రంథకర్త.

బ్రహ్మపురము,
20—౬—27.

# అంకితము.



గీ. తల్లిదండ్రులకుం గాని । తనుజుఁ డెందు
దనుజుఁ డనియందు రామాట । తథ్యమగును;
తల్లి హెచ్చని యెంచి స । ద్భక్తితోడ
నామె కొసఁగితి నీగ్రంథ । మంకితముగ.

గ్రంథకర్త.

## —: ఈనాటకమున వచ్చు ముఖ్యపాత్రలు :—



### పురుషులు.

ఔరంగజేబ్—ఢిల్లీపాదుషా

దిలేర్ ఖాను } సేనాధిపతులు.
తహబర్ ఖాను }

అజిమ్ }
ముఅజిమ్ } ఔరంగజేబ్ కుమారులు
అక్బర్ }

శ్యామసింహుఁడు—బికనీర్ రాజు

దుర్గాదాస్—రాజపుత్ర సేనానాయకుఁడు

సమరదాస్—దుర్గాదాసుని సోదరుఁడు

రాజసింహుఁడు—మహారాణా

మఱియు సందర్భానుసారముగ వచ్చు నితరపురుషపాత్రలుం గలవు— [illegible] గమనింపవలెను.

### స్త్రీలు.

గుల్నార్—బేగమ్-ఢిల్లీమహారాజ్ఞి

రజియా—అక్బరుకూతురు- సంగీతప్రియురాలు

ఉదయపురరాణి.—

మఱియు సందర్భానుసారముగ నితరరాజపుత్ర స్త్రీలును వత్తురు.

☞ గమనింపవలెను.—ఈనాటకముఁ బ్రదర్శింపఁ దలఁచినవారు, బ్ర॥ శ్రీ॥ భావతుల నృశింహశర్మ గారి యనుమతిఁ బొందవలెను.



శ్రీ

# దుర్గాదాస్.

## ప్రథమాంకము.



—: ప్రథమదృశ్యము. :—

స్థానము:—రాజప్రాసాదమున, ఔరంగజేబుదర్బార్.

[సింహాసనాసీనుఁడైయున్న చక్రవర్తివామపార్శ్వమున, బికనీర్ మహారాజగు శ్యామసింహుఁడు కూర్చుండియుండును. దక్షిణభాగమున సేనానాయకుఁడగు తహబరుఖాన్ నిల్చియుండును. ఎదుట రాథోర్ సేనాపతి, దుర్గాదాసుఁడు, నతని తమ్ముఁడగు సమర్ దాసుఁడు నిలువఁబడియుందురు.]

ఔరంగ—(దుర్గాదాసుఁజూచి) మొగల్ సామ్రాజ్యలక్ష్మికి నమూల్య భూషణప్రాయుఁడైన యశ్వంతసింహుఁడు మరణించుటఁబట్టి మాకుఁ దీఱరాని లోపము వచ్చినది.

దుర్గా—ప్రభూత్తమా! మీయాజ్ఞానుసారము దేశసంరక్షణార్థమై యుద్ధమునకు వెడలినవాని కిట్టిదురవస్థ సంప్రాప్తించెఁగదా యని విచారించిన విం తేమి?

ఔరంగ—దేశద్రోహులును, దుష్టులు నగు ముష్కరు లగు కాబూ లుమూర్ఖుల నతఁడు శిక్షించి జయింపకున్న, నాగతి యేమై యుండును. ఆతనిఋణము నే నెన్నటికిఁ దీర్పఁజాలను. మొగల్ సామ్రాజ్యమున కతఁ డొక్కఁడే వీరశిఖామణి. నాకు దక్షిణబాహువై వర్తించినయాతఁడు మరణించినప్పుడు నే నెంత మరపిల్లినను నంతమనునది యుండునా? అతనిపుత్త్రుని నే నేవిధముగ నాదరించితినో (శ్యామసింహునిఁజూచి) మా శ్యామసింహామహారాజే సాక్షి.

గీ. సద్యశోవంతుఁ డైన య । శ్వంతసింహు
మరణవార్తను వినినంత । పరితపించి
ఎంతదుఃఖించితినొ దైవ । మే యెఱుంగు;
నాదు సామ్రాజ్య మూలకం । దం బతండు.

సమర్—యశ్వంతసింహుని సుపుత్త్రుఁ డగుపృథ్వీసింహుని మరణింపఁజేసి, సవతితల్లిప్రాపకమన్నట్లు, మీ రీవిధముగ దుఃఖించుట కేవలము సాహసమేయగునని సాహసించి పలుకుచున్నాను.

ఔరం—ఏమీ! ఇంచుకంతయు నాలోచింపకుండఁ బలుకుచుంటివి. నీ వెచటనుంటివో, యెవనియెదుట నిల్చియుంటివో, యెట్లు మాటలాడుచుంటివో, నీ వెవఁడవో, నే నెవడనో, యించుక విచారింపకుండ, నొకబాలుని ప్రాణముల నపహరించితినని వచించుట సాహసమేయగును. ఏమి!! ఆపసివానిఁ జంపితినా!! అసత్యదోషారోపణమున నీ కేమైన లాభముండునా? ఎంతమాటంటివి? నాపుత్త్రుఁడని భావించి, స్వహస్తములతో, ముద్దార గౌరవించి, సన్మానవస్త్రములఁ దొడఁగితినే?

సమర్—విషపూరితవస్త్రము లని యెఱుంగక ప్రాణములఁ గోల్పడిన

యమాయికబాలకుఁగూర్చి చింతింపని వా రెవరుందురు. పాప
ము — ఘోరము..... ...

శ్యామ - సమర్దాస్! నీ వెవనితో మాటాడుచుంటివో, యిపుడు నీయ
వస్థయెట్టిదో యెఱుఁగక, స్వప్నములోఁ బలువరించుచున్నావు.

సమర్ — బికానీర్ మహారాజా! యెఱుఁగనివాఁడనుగాను- మాచక్రి
వర్తితో సంభాషించుచుంటిని.

ఔరంగ —(కోపోద్దీపితుఁడై) ఆవస్త్రములు విషపూరితము లని నీ
వెట్లు నిశ్చయింపఁగలవు?

దుర్గా — ప్రభూ! ఆత్మ కాత్మయే ప్రమాణము. కోడివలెఁ గూయు
చున్న లోకమే ప్రమాణము. లోకమునూయఁగ మూకు
డున్నదేయన్నట్లు ప్రజల యనుమానముఁ బాప బ్రహ్మ
శక్యమా?

సమర్దా—అనుమానమా? ఆవస్త్రముల ధరించిన వెంటనే, గిజగిజ
కొట్టుకొని ప్రాణములఁ బాయుట యనుమానమా! కను
లార నేనుజూచినపిమ్మటఁ బలికినది యనుమానమా! అట్ల
యిన లోకమంతయు ననుమానము. యశ్వంతసింహుని "ఆఫ
గనిస్థానమునకుఁ బంపి, యతనిఁ జంపించుటయు ననుమాన
ము—అనంతర మతనిదారాపుత్త్రిల, నేఁడు ఢిల్లీయందు బం
ధించుటయు ననుమానము—చక్రవర్తియు, నీవు, నేను, సమ
స్తవిశ్వము ననుమానమే "స్వర్గము మిథ్య— పలాయనము
మిథ్య" యను వేదాంతమున కనుకూలమైన యీ యను
మాన మేరీతివచ్చినది? అనుమాన మనునది లేదు- సర్వము
సత్యము- ప్రత్యక్షము.

కం. అనుమానమొ యవమానమొ?

వినుమా నిను నమ్మికొన్న బిడ్డను దండ్రీ

బెరుభూతమవై చంపితి
వను మాటలలో నొకింత యనృతముఁగలదే?

దుర్గా—సహోదరా! శాంతింపవలెను. నీ విచ్చుటికి వచ్చుటకు ము న్నట్టిప్రతిజ్ఞఁ బల్కితివో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

సమర్గా—అన్నయ్యా! సమయానుకూలముగ నన్ను మేల్కొల్పితివి-క్షమింపుము- (అని ఔరంగజేబుఁజూచి) మే మమాయికుల మనియు, లోక మెఱుఁగని శిసువుల మనియు, బాదుషావారు తలంపవలదని ప్రార్థించుచున్నాను.

దుర్గా—ప్రభూత్తమా! అజ్ఞానియగు మత్సహోదరుని క్షమింపవలెను. మామనవి నొకించుక యాలింపవలెను.

ఔరం—మంచిది. సంసిద్ధుఁడను. ని న్నెన్నఁడైన నిరాకరించువాఁడను గానని విశ్వసింపుము.

దుర్గా—యోధపురాధీశుండును—మృతుఁడు నగుయశ్వంతసింహుని దారాపుత్త్రాదుల వారిదేశమునకుఁ గొంపోవ ననుమతింపవలెను.

ఔరం—ఔను! నా యనుమతిఁకోఁ బనియేమి?

దుర్గా—చిత్తము. శ్రీవా రనుమతింపవలెనని సేనాధ్యక్షుఁడు తహబర్ఖాను పల్కుచున్నాఁడు.

ఔరం—(సేనాపతిఁజూచి) ఖాఁ! అట్లేలపల్కితివి?

తహబ—తమ రట్లాజ్ఞాపింతురేమోయని, యూహించి యట్లంటిని. ఇంతకు సేవకుఁడు స్వతంత్రింపవచ్చునా?

ఔరం—ఓహో! మఱచితిని. నావిశ్వాసమునకు, గౌరవమునకుఁ బాత్రుఁడై ప్రవర్తించిన యశ్వంతసింహుని ఋణముఁదీర్చుటకవకాశము లేకపోయెఁగదా యని చింతించి, యతనిరాణిని

సమర్ — మంచిది. ఇపుడే పోవుచున్నాను. చక్రవర్తిగారికిఁ జిన్న మనవి. మీ పూర్వులవలె కామవికారమునకు లోఁబడి వివాహాదిదుష్కృత్యముల నొనరింపక, నిజధర్మానురక్తిఁ బ్రవర్తించి, మాకు సంతోషదాయకుఁడైన ప్రస్తుతచక్రవర్తిని మేము గౌరవింపకపోము. మీరు మాయందు దయయుంచి పృథ్వీసింహున కొనరించిన సత్కారముతోఁ సంతృప్తిఁ బొంది, సంతానయుతముగ రాణినివిడిచిన మీకుఁ గృతజ్ఞులమై యుందుము. "ఔరంగజీబు నిజమగు మహమ్మదీయుఁ" డను ప్రఖ్యాతియు దిగంతముల వ్యాపించును.

(అని నిష్క్రమించును.)

ఔరం — (దర్బారునుండి నిష్క్రమించుచున్న సమర్దాసు నెదుర్కొనఁబోయిన సేనాధిపతిని వలదని వారించి, దుర్గాదాసునిఁ బరికించి) దుర్గాదాస్! నిన్నుఁబట్టి సమర్దాసుని విడిచిపెట్టవలసి వచ్చినది. అతఁ డాడినమాటలలో నేను నిజమగు మహమ్మదీయుఁడ ననునంశముమాత్రము సత్యము. నాధర్మమును, నామతమును నభివృద్ధిఁజేయఁదలంచియే రాజ్యభారమును భరించితిని. నిరపరాధుల శిక్షించువాఁడఁ గాను.

దుర్గా — సత్యము. మీరు చెప్పినది బాగుగనున్నది. ఆమాటకేమి గాని మీ కిసుమంతయుఁ గలలోనైన హానిచేయని యశ్వంతసింహునిదారాపుత్రాదుల హింసింపఁదలంచిరేల? వివాగూఢభావ మెఱుంగుటకు మానవమాత్రులు చాలరనియు నెఱుంగుదును.

ఔరం — నేను వారిని హింసింపవలెనను కోరికతో నెట్టికార్యముఁ జేయను- (అని శ్యామసింహునిఁ జూచి పొమ్మనిసంజ్ఞఁజేయును. అతఁడు మెలమెల్లఁగ వెడలిపోవును)...........దుర్గా

దాస్! రాజనీతివిశారదుఁడ వగు నీమెడ నా చాతురీగరిమ కు విలువయుండదు. సత్యముఁ బలుకుచున్నాను. నీతో మఱి చెప్పకేమి? ససంతానముగ రాణినిఁ గోరుచున్నాను.

దుర్గా — మీ కిట్టికోరిక గలదని యెఱుంగుదును గాని యిట్టి కోరికకు దగినంతకారణ ముండవలదా? మహారాణి— స్త్రీ—ఆమెపుత్త్రుఁడు—సద్యోజాతుఁడు. వీరితో మీ కేమి ప్రయోజనము.

ఔర—ప్రభుత్వమువారు కారణకార్యములు భృత్యుల కెఱిం గింపరు.

దుర్గా —అట్లయిన నాప్రార్థనము వ్యర్థమైనది.

ఔరం—అట్లే భావింపవచ్చును. రాణి నా కర్పించుటకు నీవు సమ్మ తింపవలెను.

దుర్గా—నేను బ్రదికియుండఁగ నట్లెన్నటికి జరుగదు.

ఔరం - నిన్న నేకవిధముల బహూకరింతును.

దుర్గా - మీచే బహూకరింపఁబడినవారికంటె నే నతీతుఁడనని యె ఱుఁగుఁడు. నాచేత ఖడ్గముండఁగ, నాముక్కుకొన నూపిరి యుండఁగా, రాణి కెట్టియపాయము వాటిల్లదు. మీరేమియుఁ జేయఁజాలరు. చిత్తగింపుఁడు. పోయివచ్చెదను. (అని నిర్గ మించుచుండ)

ఔరం—నిలుపుము. అట్లయిన నీవు బ్రదికియుండరాదు. (సేనాధి పతిఁజూచి) తహబర్! నాటకముఁ జూచుచుంటివా? దుర్గా దాసుని బధింపుము.

(సేనాధిపతి దుర్గాదాసుని సమీపించును. దుర్గాదాసు డాగ్రఁ హించి ఖడ్గముఁజూపి) అప్రమత్తుఁడవై మెలంగుము. నేను రణమునకు మరణమునకు సంసిద్ధుఁడనై యున్నాను. (అని.

పలికి కటిలంబితమైన బిగులూదును. వెంటనే ఐదుగురు యోధవరులు దర్బారుఁ బ్రవేశింతురు.)

దుర్గా—చూచితివా చక్రవర్తి! ఇట్లే అవసరమైన అయిదువందల మంది రాఁగలరు. మేము రాజపుత్రులము.

సీ. అరిరాజలోకసం । హారఖేలనలీల
నల్లేరుపైబండి । నడక మాకు
మ్లేచ్ఛశరీరమాం । సచ్ఛేదనక్రియ
షడ్రసోపేతభో । జనము మాకు
విపులసేనావ్యూహ । భేదనోద్యోగంబు
కరతలామలకంబు । కరణి మాకు
ప్రళయాగ్ని కణతుల్య । గుళికారణప్రాప్తి
మృదుపుష్ప కందుక । క్రీడ మాకు
గీ. మానమే రాజపుత్రాభి । మానధనము
కదనరంగంబె విను మాకు । సదనసీమ
తగని యధికారగర్వంబుఁ । దక్కనీము
నుష్కయత్నంబు లేల తు । రుష్కరాజ.

ఔరం—మంచిది. దుర్గాదాస్! వెంటనే యీస్థలము విడువవలెను. నీధైర్యసాహసంబులకుఁ జాల సంతోషించితిమి. (సహచరులతో దుర్గాదాసుఁడు వెడలినపిమ్మట, సేనానాయకునిఁ జూచి) తహబర్! కొంతసైన్యముతో వెంటనే యశ్వంతసిం-హుని గృహము ముట్టడింపుము. తత్ప్రయత్నమున నుండుము. (నిష్క్రమించును.)

తహ—చిత్తము. (అని అనుసరించును.)



## ద్వితీయదృశ్యము.

రాజాంతఃపురమందలి సామ్రాజ్ఞియగు గుల్నార్
విశ్రామమందిరము.

గుల్నార్—(సుఖాసీనయై తనలో) యోధపురరాణి! నీ వొకనాడు గర్వముచే కన్నుగానక నన్నౌరంగజేబుచేఁ గొనితేఁబడిన దాని నని యెకసక్కెములాడితివి. ఆ నీగర్వమణంచుటకు నేఁడు నాకు దగిన యవకాశము చిక్కినది. నీభర్తను కాబూల్ దేశమునకుఁ బంపి చంపించినదానను నేనే! విషప్రయోగముచే నీజ్యేష్ఠపుత్రుని మరణింపఁజేసినదానను నేనే! ఇపుడు నీసమక్షమున నీచిన్నతనయునిఁ జంపింప సమకట్టి నిన్నిచటికి రావించినదియు నేనే! ఈగుల్నారే నీచేఁ దన పాదోదకములఁ బానము చేయించును. అనంతర మీసమస్త మొగల్ సామ్రాజ్యమును శాసించుచున్న నేనే నీ ప్రాణములఁదీసి నీ రక్తమును గ్రోలి, నాక్రోధపిపాసను శాంతిపరచుకొందును. ఔరంగజేబు కేవలము నాచేతి కీలుబొమ్మ వంటివాఁడు; కాని లోకమన్యథా తలంచుచున్నది. అది వారి మౌర్ఖ్యము-వారి యజ్ఞానము- వారి యమాయకత్వము- లేకున్నచో ! ఔరంగజేబునకు యశ్వంతసింహుని భార్యాపుత్రులతో నేమిప్రయోజనము గలదో వారు యోచించియే యుందురు.

[అయ్యవసరమున ఔరంగజేబు ప్రవేశించును.]

గుల్—ఎవరువారు? చక్రవర్తులా? బందగీ, జహాఁపనా!

ఔరం—గుల్నార్! నీ వేకాకినివై యేమిచింతించుచున్నావు? నే డ్డవనికి నూరేండ్లు నిండినవి. నీకన్ను లరుణితములైనవే.

గుల్ — జోధపురపట్టమహిషికొఱకై నిరీక్షించుచున్నాను. ఆమె యెచ్చటనున్నది?

ఔరం — ఆమె యింతవేగముగఁ బట్టువడదు.

గుల్ — ఏమీ! పట్టువడదా?

ఔరం — దుర్గాదా సామెను నాకర్పించుటకు సమ్మతింపక దర్బారునుండి వెడలిపోయెను. ఇంతవఱకు నతఁడు ప్రభుభక్తి పరాయణుండని విశ్వసించి మోసపోతిని. కాని యత డిట్లు తిరుగుబా టొనరించునని స్వప్నమందైనను తలంచకుంటిని.

గుల్ — ప్రాణములతో దర్బారునుండి పోఁగలిగెనా?

ఔరం — ఔను. అతడు ససైన్యముగ వచ్చియుండెను.

గుల్ — (కపటపునవ్వును వెలిబుచ్చి) ఆహ్హాహ్హా! పరాక్రమశాలియు, నరసింహాదనుండును, జయశీలుఁడు నగు మొగల్ సామ్రాట్టునకు సైన్యము లేక దైన్యము వచ్చెఁగాఁబోలు! ~~ఛీ! ఛీ!~~

ఔరం — ప్రేయసీ!.. ......

గుల్ — పెక్కుపలుకు లాలించుటకు నాకు సమయము చాలదు. నేటిసాయంకాలమునకుఁ బూర్వమే నాసమక్షమున జోధపురమహారాజ్ఞిని దెచ్చి నిలుపవలెను.

ఔరం — గుల్నార్! యశ్వంతసింహునిగృహమును ముట్టడింప సైన్యములఁ బంపితిని.

గుల్ — మంచిది.......... (నిష్క్రమించును.)

ఔరం — (ఆమె ననుసరించుచుఁ దనలో) ఆహా! ఏమి యీ దుర్గాదాసుని సాహసము! నిండుదర్బారులో — నాకట్టెదుట — కరవాలమును దూసి — నన్నుఁ దర్జించుచు వెడలెనే? పిరశిఖా

మణియుఁ దనకు ప్రభువు నగు యశ్వంతసింహునకు నిట్టిసాహసము లేదు. మంచిది. పరికించెదఁగాక.

(అనుచు నిష్క్రమించును.)

## తృతీయ దృశ్యము.

మొగల్ సేనాపతియగు దిలేర్ ఖాన్ మందిరము.

[ప్రధానసేనాపతి తహాబర్ ఖాన్, దిలేర్ తో సంభాషించుచుండును.]

దిలేర్ — ఖాన్ సాహేబ్! మీరు బలే గొప్పవస్తాదుల వారని యందురే. మీమాటవిన్న నాగుండె తుస్ మనుచున్నది. రాథోడ్ సేనాపతి మీముక్కునకు సూటిగఁ గత్తివిసరినాఁడా? అబ్బ— అబ్బ — వాఁడు బలేవీరుడన్న తప్పులేదు.

తహాబర్ — ఏమని చెప్పఁగోరుదును. చెప్పిన వినువా రెవరు? పరిహాసములాడువా రే కాని, నాదుఃఖము నణఁచెడువా రెవరు — ఆనాఁడు దర్బారులోనే వాని పరాక్రమ మెంతో నాకు బోధపడినది కోపము వచ్చినప్పుడు వాని ముఖముఁ జూడలేము. పెద్దపులిముఖమైనను జూడవచ్చును- కాదు- కాదు- మృత్యుముఖమైనను జూడవచ్చును- ఎంతకోపము — కోపమునుమించిన పరాక్రమ మెంతని చెప్పుదును—పరాక్రమమునుమించిన నైపుణ్య మిట్టిదని కొనియాడఁగలనా? అహాహా! అతినైపుణ్యమున విసరినకత్తిఁజూచి తత్తఱిల్లితిని. నీతోఁ జెప్పుకేమి?

దిలేర్ — మీరు తటకాపడి చూచుచు, నిలుచబడిరన్నమాట! ముక్కునకు తిన్నగా విసరియుండెనా?

తహాబర్ — ఔ నల్లే, ఆశ్చర్యమున నేను కఱ్ఱబొమ్మవలె నిల్చి దిగ్భ్రమఁ బొందితిని.

దిలేర్—మీమొలలోని కత్తి యేమైనది?

తహబ—సమయము చిక్కకుండెను. అంతలో కత్తి నూడబెఱికి, ఇంతలో మాయమయ్యెను.

దిలేర్—ఆఁ! తెలిసినది. కనుకట్టు కట్టినాఁడు. అతఁడు వెడలినపిమ్మ టఁ గత్తిబట్టినారా?

తహబ—లేను. తరువాత నేను నాముక్కున్నదో లేదో చూచుటకై, ముక్కుపై వ్రేలిడికొంటిని. సందేహము నివర్తించెను. యశ్వం తసింహుని గృహ మిప్పుడు మనము ముట్టడింపవలయును. త్వ రగ రండు!

దిలేర్—ఈసమయమున నొకక్షణమైనను విరామము లేకుండ నన్ని డ్చుకొనిపోవ వచ్చినారా? ఈసామాన్యకార్యమును తమ రేల చేయరాదు?

తహబర్—దిలేర్ ఖాఁ! యుద్ధనైపుణ్య మెఱుఁగని రాజపుత్రుల తోనా, నన్ను పోరాడమనుచున్నావు? ఆపని నావలనఁ గానేరదు. నీవే రావలయును.

దిలేర్—రసపుత్రుల సైన్యసంఖ్య యెంత?

తహబర్—రెండువందలు మాత్రమే.

దిలేర్—ఖాఁసాహెబ్! మీరుపోయి అయిదువేలసైనికులతో సిద్ధముగనుండుడు. నేను మీవెనువెంటనే బయలుదేఱి వచ్చె దను.

(తహబర్ నిష్క్రమించును.)

దిలేర్—(ఆత్మగతమున) అసామాన్యసాహసికాగ్రమణులకు రాజ పుత్రస్థానము గనివంటిది. వీరనుపమానపరాక్రమవంతులకు గురువులు. అట్టి ధైర్యశాలురతో పోరాడుట కష్టసాధ్యమే

మైనను, పాదుషావారియాజ్ఞ యనుల్లంఘనీయము గదా? (అవనతశిరస్కుఁడై) యశ్వంతసింహుఁడు మరణించినపిదప, నిర్భయుఁడైయున్న పాదుషాకు, నిపుడతనిపరివారముతోఁ బ్రయోజన మేమున్నదో తెలిసికొనవలయును.

(అనుచు నిష్క్రమించును.)

## చతుర్థదృశ్యము.

మీవారురాజ్యరాజప్రాసాదమున—రాణారాజసింహుని ద్వితీయపుత్రుఁడగు జయసింహుని మందిరము.

[జయసింహుని ద్వితీయభార్య కమల సుఖాసీనయై యుండును.]

కమల—హా! స్వామి! ఇంత స్వల్పకాలమున మిమ్ముల మాయామోహ గురులోఁ దోసివైచినదే! ఎంతటిసాహసికురాలు! కానిమ్ము. పెద్దరాణి! నీయెత్తునకు పైయెత్తును వేయుచున్నాను. నిన్నిఁక నా పదతలమునఁ బడవేసి నలిపివేసెదను. భీమసింహా! నీవు రాజువయ్యెదవా? కావచ్చును. మఱి నీభార్య మహారాజ్ఞి కావచ్చును. కాని యట్లు కాఁజాలరు. నాభర్త రాణావారి కత్యంతప్రియపాత్రుఁడు. విశేషించి యతనికి స్వహస్తములతో రాజబంధనమును కట్టియున్నాఁడు. (పండ్లు కొఱుకుచు) ఇఁక భీమసింహుఁ డెట్లు రాజగునో, యతనిస్త్రీ రాణి యెట్లుఁ కాఁగలదో చూచెదఁగాక! అన్నదమ్ము లిరువురకును గలహము గూర్చితినిగదా! దాని పరిణామ మెట్లుండునో పరికింపవలెను.

[రోదనసేయుచు దాది పరుగెత్తివచ్చును.]

దాది—ఓలమ్మో! ఓలమ్మో!! అబ్బ!!

కమల—ఏమయ్యె నే?

దాది —మరేముందోలమ్మో! పాంఘుయుద్ధమోలమ్మో!
కమల —ఏమైనదే? త్వరగ చెప్పకున్నావేమి?
దాది —ఏట్రా? ఏటనడుగుతా? దకుయగ్గమోలమ్మ!
కమల—వేగముగ చెప్పెదవా, శిక్షకు పాత్రురాల వగుదువా ?
దాది —చిన్నరాజు పెద్దరాజు కాలిని కత్తితో నరికినాడమ్మో! ఓహో అదేమి రక్తమోలమ్మ! అంతలో తండ్రొచ్చి, పెద్దోడ్ని చీవాట్లు పెట్టినాడమ్మో!
కమల —మంచిపనియైనది.
దాది—అంగ నొద్దుసుమీ! లోకమంతా పెద్దోడే మంచోడంటారు. సిన్నోడు సెడ్డమనిషి కాడు కానమ్మో, నువ్వే జగడాల పెద్దమ్మ వు తల్లీ! నీనుంచమ్మో, పెద్దోడికి మాటొచ్చింది. ఏడుకాండల రామాయణం తండ్రిచేత యినుకున్నాడు.

(భయమును నటించుచు నిష్క్రమించును.)

[ఆసమయమున జయసింహునిప్రథమభార్య సరస్వతి ప్రవేశించును.]

సరస్వతి—కమలా! కమలా! ఇట్టి దుష్కార్యములచేయుట నీ కుచితమని తోచినదా యేమి? అన్నదమ్ము లిరువురకుఁ గలహము లఁ గల్పింతువా?
కమల—అది కేవల మసత్యము. ఇంక నేనేమియును జోక్యమును కలిగించుకొనుట లేదు. సింహాసనముకొఱకు సహోదరులు పోట్లాడుట సహజమేకదా! న్యాయముగ నాభర్తయే సింహాసనారోహణార్హుడు. భీమసింహుడే తొలుత జగడమాడెను. అది యతనిదోషము.
సరస్వ—భీమసింహుని కీరాజ్యవాంఛ లేదని రూఢిగఁ జెప్పగలను. ఉన్నను అతడు జ్యేష్ఠు డగుట నతనికే రాజ్యము చెందును.

కమల—జ్యేష్ఠత్వ మటులుండగా నాభర్తృజన్మదినమున రాణావారతనికి స్వహస్తముల రాజబంధనమును (పసుపుదారము) కట్టినారు; కావున నాభర్తకే సింహాసనము చెందును.

సరస్వ—అట్లయినచో నీవు ప్రయత్నించుట శ్రేయస్కరము. కాని, జగడములఁ గల్పింపవచ్చునా?

కమల—నాభర్తవిషయమై నీవు చింతింప నవసరములేదు.

సరస్వ అతఁడు నాభర్త కాఁడు కాబోలు.

కమల—అట్లయిన నతనిని సమాధానపఱచుము.

(అని ద్రుతగామిని యైపోవును.)

(అంతట జయసింహుఁడు ప్రవేశించును.)

జయ—ఎవరువారు? సరస్వతీ! నీవా? కమల యనుకొంటిని.

సరస్వ—కమల యనుకొంటిరా నాథా! ఎంతపొరపా టొనరించితిరి? ఆపొరపా టెంతలో మాయమయ్యెను! పొరపాటున నన్ను కమలగా భావించుటకు పూర్వ మొక్కసారి "ప్రాణేశ్వరీ" యని యేల పిలువకుంటిరి? నే నాపలుకుల విని స్వర్గసౌఖ్యమును పొందెడుదాననే!

జయ—సరస్వతీ! నా కిచ్చోట నుండుటకు సమయము చాలదు. అత్యావశ్యకకార్య మొకటికలదు. పోవలయును.

సరస్వ—నిలువుడు! నిలువుడు! నాహృదయవేదనము గూర్చి తమతో విన్నవించుకొనుటకై నే వచ్చుటలేదు. ఒక ప్రశ్నము నడుగ వచ్చినాను. నేఁ డన్నగారితో జగడమాడిరా?

జయ—అది నాదోషముకాదు. నేను క్రోధావేశమున అన్నగారి పాదమును గాయపఱుప నతఁడు నామెడను గట్టిగఁ బట్టుకొనెను.

సరస్వ—ప్రభూ! కమల మిమ్ముల నీవిధముగ నాడించుచున్న దని యెక్కనా డైన తలఁపకున్నారు. భీమసింహునకు రాజ్యాపేక్ష ముమ్మాటికిని లేదు. అన్నదమ్ము లిట్లు కలహించుట పాడి గాదు ప్రభూ! ఇఁకనైన మేలుకొండు! కమల మీహితచింతకురాలు కాదని విశ్వసించుడు. అదిగో! మీఅన్నగారు వచ్చుచున్నారు. నేను బోయెదను.

[భీమసింహుడు ప్రవేశించును]

భీమ—(మృదుస్వరమున) సోదరా! జయసింహా!

జయ —(పలుకక మౌనమూనును.)

భీమ—(మరల) జయసింహా! అది నాదోషము. కోపము నణంచుకొనలేక యట్లు పొరపా టొనరించితిని. నన్ను క్షమించుము!

జయ —(మాటలాడలేడు.)

[ఆయవసరమున రాణా ప్రవేశించును]

రాణా —(భీమసింహు నుద్దేశించి) నాయనా! జయసింహుడు—కర వాలమున నీపాదమును గాయపఱచెనా?

భీమ —అది యంతప్రమాదకరము గాదు.

రాణా—ఏదీ పాదమును జూపుము.

(భీమసింహు డట్లు చేయును.)

రాణా —హా! నేను బాగుగ నాలోచింపక విచారణ జేసితిని. భీమసింహా! ఇదిగో నాకత్తి నందుకొని నీసహోదరుని శిక్షించుము!

భీమ —అట్లు చేయఁజాలను. తండ్రీ! జయసింహు డజ్ఞాని.

రాణా —అట్లుకాదు. నేను జయసింహుని పక్షపాతినని లోకము నన్ను నిందింపకపూర్వము నీ వీకత్తినిగైకొని వానిని శిక్షింపవలయును. కతిపయదినములనుండి మీయిరువురును రాజ్యము నకై జగడమాడుచున్నా రని వినుచున్నాను. నా మరణానంత

రము నిట్లు కలహమాడెదరని భయపడుచున్నాను. కాన
నేడే యుద్ధమొనరించి గెలుపొందినవారు సింహాసనము నధి
రోహింపవచ్చును.

భీమ—నాకు రాజ్యకాంక్ష లేదు. నేను జగడ మాడఁదలచుకొనలేదు.

రాణా—దీనికి ప్రమాణము?

భీమ—(మందహాసమున) ప్రమాణమా? ఈక్షణమునుండి నేను
స్వరాజ్య పరిత్యాగ మొనరించుచున్నాను. ఈరాజ్యమున జల
పానముఁగూడ చేయనని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

రాణా—(కొంతదనుక మౌనము వహించి, కన్నీరు గార్చుచు) భీమా!
నిర్దోషివగు నీవు తమ్మునికై కఠినప్రతిజ్ఞను బూనితివి. కాని
యీప్రతిజ్ఞ మీవారురాజ్యమంగళముకొఱకు సుమా! విదే
శములకు పోయినను దేశక్షేమము నారయుచుండుము. భగ
వంతుడు నీకుఁ దోడ్పడుగాక.

భీమ—నా దేశక్షేమమునకై ప్రాణములనైనఁ ద్యజింతును. నమస్కా
రములు.

(అందఱు నిష్క్రమింతురు.)

పంచమదృశ్యము.

యశ్వంతసింహుని గృహము.

[సమర్దాస్ జోధపురసామంతగణము- సంభాషించుచుందురు.]

భగవాన్‌సింహు—సమర్దాస్! అట్లయిన నీ వచట దుర్గాదాసుని తలం
పునకు విరుద్ధముగఁ బ్రవర్తించి వచ్చితివా యేమి? నిన్నుఁ
జూడ సంశయముగనున్నది.

సమర్దాస్—నేను క్రోధము నణచుకొనలేక పోతిని.

భగవా—అట్టివాఁడె వచటికిఁ బోనేల?

సమర్దాస్ — ఏలపోవలయునని యడుగుచున్నావా? ఆపాపాత్ముని జూడఁదలంచి వెడలితిని. వాని నెదిరించి ప్రసంగింప నిచ్ఛగించి పోయియుంటిని. వానిని బ్రతిమాలుటకు పోలేదు. ఆపని దుర్గాదాసే చేయవలయును.

ముకుందదాస్ — చక్రవర్తి దుర్గాదాసును బంధింప లేదుకదా?

సమర్దాస్ — (ఉత్తేజితుఁడై) వానితరమా?

సుబలసింహుఁడు — దుర్గాదాసుఁ డతనికి సులభముగఁ బట్టువడఁడు.

ముకుంద — అదిగో! సేనాపతి తురగారూఢుడై శరవేగమున వచ్చుచున్నాఁడు! క్రిందికిఁబోయి సమాచార మరయుదము రండు.

(అందఱును దుర్గాదాసు నెదుర్కొనఁబోదురు)

[దుర్గాదాసు ప్రవేశించి]

దుర్గా — సిద్ధముకండు! సావధానులరై యుండుడు!

సమర్ — ఎందులకు?

దుర్గా — ఆత్మరక్షణార్థము.

సమర్ — సమాచార మేమి?

దుర్గా — విస్తరించి పలుకుట కవకాశములేదు. పాదుషా యశ్వంతసింహునిభార్యాపుత్రుల విడువ సమ్మతింపక, యీభవనమును ముట్టడించుటకై మువేలమంది సైనికులఁ బంపుచున్నాఁడు. ఆరెంఁడు ప్రాణములను కాపాడు భారము మనది.

ముకుంద — రక్షణోపాయ మేమి?

దుర్గా — ప్రాణదానమే రక్షణోపాయము. సామంతులారా! మహారాణిని, ఆమెచిన్నతనయుని భద్రముగఁ గాపాడుటకై ప్రాణత్యాగము చేయ మీరందఱును సంసిద్ధులైయున్నారా?

అందఱు — తప్పకుండ నట్లే యొనరించెదము.

[అంతలో మహారాణి ప్రవేశించును.]

మహారాణి — యోధపురమహిషి కెంతమాత్రము జంకు లేదు. ఆమె కై మీరు చింతింపవలదు; కాని, యోధపురవంశప్రదీప కుని—యశ్వంతసింహునిచిన్న బాలుని రక్షింప నుపాయ మర యుఁడు.

దుర్గా— తల్లీ! భయమునలదు. కుమారునిఁ గొని తెండు.

(రాణి లోనికేగును)

దుర్గా—సమర్దాస్! కాసిమ్ను పిలువుము! (ముకుందు నుద్దేశించి) దాదా! ఆవల నొక పెద్దగంపగల దద్దానిఁదెమ్ము!

[కాసింతో సమర్దాసు ప్రవేశము]

కాసిం—(దుర్గాదాసునకు నమస్కరించి) హుజూర్! క్యా హుకుమ్?

దుర్గా —నీవు రాజకుమారుని, మొగల్ సైన్యముల కంటబడనీయకుం డ భద్రముగఁ గొనిపోయి రక్షించవలెను.

కాసిం—అచ్ఛా! హుజూర్!

(ముకుందుడు గంపను తీసుకొనివచ్చును.)

దుర్గా—కాసిం! నీవు ముసల్మానుడ వగుటచే మొగలు లెవరు ని న్నుపోల్చుకొనలేరు. ఈమిఠాయిగంపలో రాకుమారునుంచి, నేను నీకిదివఱకు చూపిన దేవాలయమునకు గొనిపోయి- శిశువు నామందిరపురోహితుని కప్పగించుము. ఆపైకర్తవ్య ము నతడే యాలోచించును.

కాసిం— జో హుకుం.

[కుమారునితో రాణి ప్రవేశము]

దుర్గా—మహారాణి! నాకంఠమున ప్రాణమున్నంతదనుక రాకుమా రున కెట్టియపాయమును రానీయను. ఈకాసిం ముసల్మా

నుడే నైయెనను, నాకత్యంతాప్తుడు. భయపడక శిసువు నాతని హస్త లంచుంచుడు !

రాణి—నీ వభయమిచ్చిన పిమ్మట నాకేమియు భయములేదు. (అనుచు కుమారు నతనిచేతుల నిడెను.)

(తిరిగి బిడ్డనొకసారి కౌగలించి, ముద్దాడుచుండెను)

దుర్గా—సమయము లేదు. తల్లీ ! విళంబనము సేయవద్దు !

రాణి—(మరల మరల బిడ్డను ముద్దాడుచు) కాసిం ! ధర్మమే నీకును నాకును సాక్షి. (అని కుమారుఁజూచి)

చం. పురమిని పేదసాఉనకుఁ । బుత్త్రుఁడవై జనియించియున్న నీ
యిఁకుములు లేక వర్ణవయి । యెచ్చటనైన మెలంగి కాలమున్
గడపఁగ నోపియుందువు సు । ఖంబులఁ జెందుచు నాదు పాపపుం
గడుపున నేలపుట్టితివి । తన్మొపతు లెల్లరు గొడ్డువోయిరే.

(అని కుమారుని కాసిమ్‌నకు నందిచ్చెను-కాసిమ్ శిశువును గంప లోఁబెట్టి కొంపోవుచుండ)

సమర్‌వాన్—ఒకవేళ, కాసిం ! శత్రుహస్తగతుండైన నేమ్చిచేయవలెను.

మహారాణి—అట్లు శత్రువులకు జిక్కినచో, యీనాకత్తితో శిశువు నుపాడిచి చంపుము, కాసిం ! (అని కత్తి నతనికిచ్చును)

(కాసిం నిష్క్రమించును)

దుర్గా—అదిగో ! మొగల్‌సైన్యముల కగ్రవర్తియై దిలేర్‌ఖానుడు వచ్చుచున్నాడు.

సమర్—అదిగో ! శత్రువులు తుపాకులఁ బేల్చుచున్నారు.

ముకుంద—స్త్రీజనరక్షణోపాయమును వెదుకవలయును.

సుబల్—అదిగో కవాటములన్నియు బద్దలు చేయుచున్నారు ! స్త్రీ జన మిచటకు వచ్చుచున్నవి !

దుర్గా—(ఆవచ్చిన నారీబృదము నవలోకించి) సహోదరీమణులారా! అధికముగ మాట్లాడుటకు అవకాశము లేదు. ఈదృశాపాయ కరవేళల క్షత్రియస్త్రీ లేమిచేయవలయునో మీకే తెలియును. అదిగో మీకొరకాగది యేర్పఱచి యుంచితిని. దానం జొచ్చి స్వహస్తముల నగ్గానికి నిప్పంటించుకొనుడు. అదిగో! మీరాపని చేయకముందే శత్రువుల తుపాకు లాగది కవాటముల కాల్చుచున్నవి. త్వరపడుడు!

(స్త్రీజన మేకగ్రీవముగ) మహారాణీకి జయ్!

రాణి—జయమా! నాకు మృత్యువే జయము! సోదరీమణులారా! (చేతులజోడించి) పరమేశ్వరుడు మిమ్ముల రక్షించుగాక! సంఘాతమరణము నొంది స్వర్గమున కేగుడు. నా కింక నీలోకముతో కొంతసంబంధముగలదు. నేను మీతో రాజాలను. పొండు!

(స్త్రీలందరును మంటలో దుముకుదురు.)

రాణి—దుర్గాదాస్! నేను పోయివచ్చెదను. (నిష్క్రమించును)

దుర్గా—సమర్దాస్! ఒక్కసారి కౌగలించుకొనుము. (సహోదరులిరువురును గాఢాలింగన మొనరించుకొనిన పిదప శత్రువుల నెదుర్కొన బోదురు)

## షష్ఠ దృశ్యము.

ఔరంగజేబు భవనము.

ఔరం—(అటునిటు దిరుగుచుం దనలో) ఏమిది! నేను విన్నది సత్యమే యగునా? కాదు. ఇది కేవల మసత్యము. నేను స్వప్నమును గాంచుచున్నానా యేమి? అట్లైన జాగ్రదవస్థయుండుడ నేల? మేలుకొన్నవా రాలోచనాంబుధి నోలలాడువేళల,

స్వప్నములఁ గాంచిన ట్లుండుట ప్రకృతిసిద్ధమే. యశ్వంత సింహునిరాణి యత్యంత స్వల్ప సైన్యముతో దుస్తరమగు మొగల్ సేనాసముద్రమును దాటి యదృశ్య మయ్యెనట!! ఇది సంభవమగునా? ఇందేదియో రహస్య మున్నట్లు నాకుఁ దోచుచున్నది. ఎవరక్కడ?

సేవకుడు —(వంగివంగి సమీపించుచు) ఖుదాబంద్!!

ఔరం—అనన్యసాధారణప్రజ్ఞావంతు డగు మన దిలేర్ ఖానుఁ డతిస్వల్పసంఖ్యఁగల రాజపుత్రవీరుల ధాటికోర్వఁజాలక, పరాజితుఁ డయ్యెనని వింటిని. ఈవార్త సత్యము కావచ్చునా?

సేవకుఁడు—ఔను. సత్యమే. ప్రభూ! నేను యుద్ధమును ప్రత్యక్షముగఁ జూచియుంటిని. ఓహో! ఏమియుద్ధము!! ఆశ్చర్యము! భయము! యశ్వంతసింహుని భవనమునంగల నాల్గుద్వారములకడ నాయుధపాణులై పోరాడిన యోధవరులఁ గాంచుట కల దేవేంద్రుడే కావలయును. మహాప్రభూ! ఒకవంక భవనాంతర్భాగమును జొచ్చిన మొగలుల హస్తగతము కాకుండుటకు, తామున్న గదికి స్వహస్తముల నిప్పంటించి, యందు ప్రాణత్యాగ మొనరించుచున్న నారీజనముమాట నట్లుండనిచ్చి లోపలఁజొచ్చి కవాటముల ప్రక్కలనే యుండుచుఁ దుపాకిగుండ్లతో కుడ్యములఁ బడద్రోయుచున్న మనఁవీరులఁ దునుమాడుచున్న చండీస్వరూపిణియగు జోదపూర్ మహారాణియు—మందిరబహిర్ద్వారముచెంతనుండి శత్రువులు లోపలకురాకుండఁ గాపాడుచున్న రాథోరు సేనాపతియగు దుర్గాదాసుఁడును—అతనితమ్ముఁడును—ఓహోహో! ఏమి యాయాసహోదరులసాహసము! రెండువేలసంఖ్యకు మించిన సైన్యమును గని, యిసుమంతయైన జంకకుండ, ప్రళయకాల

మేఘముల నడుమనుండి బయలువెడలు తటిల్లతలవలె విరాజిల్లు కత్తుల నూడఁబెఱికి యాసేనాసమూహము నవలీల భూదేవికి బలిదాన మొసంగినంత మహారాణిఁగాంచి దిగ్భ్రాంతిఁ జెందిి యేమియు జేయలేక తిరోగమనోసంగిరి.

[అంతలో గుల్‌నాక్ ప్రవేశించును.]

గుల్—ప్రాణేశ్వరా! నేను వినినది సత్యమేయగునా?

ఔరం—(అవనతశిరస్కుండై) ఔను.

గుల్—(రోషకషాయితలోచనయై) ఓహో! ఈవిధమగు ధైర్యవిహీనమై పరాక్రమలేశమును లేని సైన్యముతో మీరు సమస్త హిందూస్థానమును పాలింప సాహసించినారా? కార్యము లేదు. చక్రవర్తులయ్యు, నాయొక్క సాధారణమగు కోర్కెను చెల్లింపఁజాలకపోతిరి!!

ఔరం—నాయథాశక్తిని ప్రయత్నించి విఫలుఁడనైతిని.

గుల్—ఇదియా, మీయథాశక్తి? సామాన్యస్త్రీయొకర్తె పెక్కుమందిపురుషుల కనులఁగప్పి మాయమయ్యెనే! ఛీ! ఏల మీ పరాక్రమములు? చక్రవర్తిబిరుదములకు మీ రనర్హులని చెప్పక తప్పదు.

ఔరం— మాట్లాడకుండును.

గుల్— ఇపుడు మహారాణి యెచటనున్నది?

ఔరం—రాణారాజసింహుని చెంత నున్నది.

గుల్—వెంటనే సైన్యముఁబంపి మీవారును ముట్టడింపుఁడు. సంతానయుతముగ నామె నాకుఁ జిక్కవలెను. ఎంత కీడొదవిన సరే.

ఔరం—ఆవిషయమునుగూర్చి యోచింపవలెను.

గుల్—గుల్నార్ పలికినమీాద నాలోచనముకూడనా? తత్క్షణము మీావారును ముట్టడింపుడు.

(నిష్క్రమించును.)

ఔరం—(ఆత్మగతమున) ఈమాటను నేను విశ్వసింపజాలను. రెండు పదులసైనికులతో రాజపుత్రులు మొగల్ సైన్యము నోడిం చుటయా? యశ్వంతసింహుని రాణి, యీ సేనావ్యూహము లను భేదించుకొనిపోవుటయా? మఱియు నాసేనల కధ్యక్షు డనన్యసామాన్యబలపరాక్రమవంతు డగు దిలేర్ ఖానుఁడా? ఇందేదియో విశ్వాసఘాతుకత్వ ముండితీరవలయును. ఆఁ! ఏమనుచుంటిని? నాకు బాల్యమిత్రుండును, నాయావసమందు సహాయభూతుఁడును, వార్ధక్యమున మంత్రియు నగు దిలేరు ఖాన్ నన్ను మోసపుచ్చుననియా తలంచుచుంటిని? అది యసంభవము- దోషము-పాతకము!!

[దిలేర్ ఖాన్ ప్రవేశించి]

దిలేర్—బందగీ, జహాఁపనా!

ఔరం—సేనానాయక! మన కపజయము సంభవించిన దని నే వినిన వార్త నిజమగునా?

దిలేర్—ఔను. సత్యమే!

ఔరం—యుద్ధముచేసి యోడిపోతిరా? భయపడీ పలాయితు లైతిరా?

దిలేర్—శ్రీవారు సెలవిచ్చినట్లు రెండుకారణములవలనను, మన కపజయము వాటిల్లెను. ఓహూ! ఆరాజపుత్రుల పరాక్రమ ము! ఏమి, వారియుద్ధనైపుణ్యము! మనసైన్యము లుద్రేక ముతో శత్రువుల చెదఱగొట్టి గృహాభ్యంతరమును జొచ్చిరి. హాహాకారములు చెలరేగ పోరాడిరి. కాని లాభము లేకపోయెను.

లోనున్నమనవారు నలుగురు, ద్వారపాలకులచే హతులైరి. మందిరబహిర్ద్వారముకడ మేము దుర్గాదాసాదులతో యుద్ధ మొనరించుచుండ, కాలజలధరమధ్యమునుండి విద్యుల్లత వెఱయు చందాన రాణి ముక్తకేశయై, ఆయుధపాణియై, మానడుమను దుమికెను. చండీస్వరూపిణి యగు నామెను, ఆమె వక్షస్థలమున నొకవస్త్రముతో బంధింపబడియున్న యాడుబిడ్డను గాంచినంతనే నేను భయపడి "కొట్టుము-కొట్టు"డని పురికొల్పఁ బ్రయత్నించితిని; కాని కంఠము రుద్ధమయ్యెను. కరవాలము నెత్తఁబోవ నది క్రింద జాఱిపడియెను. ఆమోహనమూర్తిని గాంచుచు నే నట్లె నిలువఁబడిపోయితిని. నావెర్రి చేష్టల నవలోకించి మనసైన్యము చెదఱిపోయెను. ఇం కేమున్నది ?

ఘోరం—ఛీ! దురాత్ముఁడా! సాధారణస్త్రీకంటె నధముఁ డగు నీతో మాట్లాడరాదు. (నిష్క్రమించును.)

(దిలేర్ ఖాఁ వేరొకవైపునఁ బడిపోవును.)



## సప్తమదృశ్యము.

రాణా రాజసింహునియాలోచనామందిరము.

[సింహాసనస్థుడగు రాణాయెదుట శిశుహస్తయగు యశ్వంతుని రాణి కూర్చుండును. దక్షిణభాగమున కాసిం దుర్గాదాసు లుపవిష్టులై యుందురు.]

మహారాణి—రాణా ! నాయీపుత్రుని సంరక్షణభారమును కతిపయ దివసముల పర్యంతము మీరు వహింపవలెనని ప్రార్థింప వచ్చియున్నాను.

శా. లేరా ధర్మపరాయణుల్, జనమనః । క్లేశాగ్నిఁ జల్లార్చి త
న్నారీరత్నములన్ తదీయసుతులన్ । రక్షించు వీరాగ్రిణుల్
లేరా ? దేశముగొడ్డువోయె నకటా ! । మ్లేచ్ఛుల్ దురాచారులై
కారింపంగని మిన్నకుండి రితర । క్ష్మానాయకుల్ పందలై.

రాజసింహుఁడు — రాణీ! నీపుత్రుఁడు నాకుఁ బైవాఁడు కాఁడు. వానిని రక్షించుభారము నాయది. (దుర్గాదాసు నుద్దేశించి) దుర్గాదాస్ ! ఈబాలునికూడ చంపనుద్దేశించియున్నాఁడా ?

దుర్గాదాస్ — కాకున్నచో చక్రవర్తి కాశిశువుతో నేమిప్రయోజనమున్నది ?

మహారాణి — రాణా ! ఒకపుత్రుఁడు- ఒకకన్య. ఇదియే నాసంపత్తి. ఈసంపత్తియె పరమార్థమని ఢిల్లీనుండి బయలుదేఱి వచ్చుచుండఁ దారిలో నాకుబిడ్డ మరణించినది. నా కులదీపకుండును- సద్యోజాతుండు నగు వీనినిమాత్రము మీరు కాపాడినఁ జాలును.

రాజసింహుఁడు — రాణీ ! పుత్రుని, నాప్రాణమునైన సమర్పించి కాపాడెదను. ఔరంగజేబుని యత్యాచారము క్రమక్రమాభివృద్ధిఁ బొందుచున్నది.

ఉ. కారణమేమొ దైవమెఱుఁ । గందగు మ్లేచ్ఛుఁడు తుచ్ఛుఁడై దురా
చారపరాయణుం డయి, ప్ర । జల్ తపియింపఁగ నేచుచుండె, నే
ధీరుఁడు సాహసింపక, ప్ర । తిక్రియ కోపక మిన్నకుండె, హా!!
భారతమాత కెట్టి దుర । వస్థ ఘటిల్లెను నేఁటి కక్కటా.

అతఁడు తిరుగ హిందువులపై 'జిజయా'పన్నును విధించుచున్నాఁడు. మార్వాడదేశాధీశుఁ డగు యశ్వంతసింహునికుటుంబముపై కార్పణ్యము వహించియున్నాడు. ఇఁక నేను తూష్ణీంభావుఁడనై యుండుట యపాయకరము; కావున నొకజాబును వ్రాసి

చూచెదను. అప్పటికిని వాఁడు దుండగముల నొనరించెనేని, శిక్షింపఁ బ్రయత్నము కావించెదను.

రాణి—జాబును లిఖించుటయా? అనునయవినయములతో నా దుష్టునిచెంతకు కమ్మనంపుటయా? వలదు. వలదు. రాణా! ఈపర్యాయము మొగల్ సామ్రాజ్యమును సమూలముగ విచ్ఛేదనము కావింపవలెను.

రాజసింహ—(ఆలోచించి) ఔ నది సత్యమే.

ఉ. వృద్ధుఁడనయ్యు నాకు నవి । వేకము వద్దికిఁబాఱుచుండె నా
క్రుద్ధుఁడు సామవాక్యముల । కుఁ జెవియొగ్గునె, సమ్మతించునే?
యుద్ధమొనర్చి, నిష్ఠురత । కోరిచి దర్పము సంహరించి ది
జ్మద్ధయశోధ్వజుండనయి । కాలముఁ బుచ్చెద మానినీమణీ.

(అని కాసిమ్‌వంకఁ దిరిగి) ఇతఁ డెవరు?

దుర్గా—ఇతఁడు నా బాల్యమిత్రుఁడు. ప్రాణభీతిని విడనాడి మా చిన్ని ప్రభువును మొగలులబారినుండి కాపాడెను.

కాసిం—రాణా! నాపేరు కాసిండుల్లా. దుర్గాదాసు నన్నొక యాపదనుండి రక్షించెను. ఆనాఁటినుండియు నే నితని భృత్యుండనై యున్నాను.

రాజసింహ—ఔరంగజేబ్! ఉన్నతపదవి నలంకరించియు, నీ వొక శిశువును హత్యకావింప నుంకించియున్నావు. చూడుము! ఈ కాసిమ్‌ను జూచి సిగ్గుఁ దెచ్చుకొనుము.

రాణి—రాణా నే నాదుష్టాత్మునిపై పగదీర్చుకొనునిమిత్తము నారీజనముతో నగ్నిప్రవేశ మొనరింపక బ్రతికియున్నాను.

రాజ—అట్లే కానిమ్ము. మీయిరువురు నాయింట నిర్భయముగ నివసింపవచ్చును.

రాణి——నేనా! ఇచట నివసించుటయా! ఎన్నడు నట్లు చేయఁజాలను నారాజ్యమున నివసింతును. ఆపదసంపదలయందును- సుఖ దుఃఖములందును నాభర్తయే నాదైవము. అతని యోగ్యలయ మునసే నాకు మనశ్శాంతి చేకూరును.

రాజు——అమ్మా! ప్రస్తుత మాస్థలమున నీవు క్షేమముగ నుండ జాలవు.

రాణి -అట్లుకాదు. నేను ఆపదనే కోరుచున్నాను. ఆపదయన్న నాకు భయములేదు. భూకంపమునందు జన్మించితిని. ప్రళయ మేఘశయ్యపైఁ బెరిగితిని. తుపానుచే లాలింపఁబడితిని. ఇక నా కాపదయన్న భయములేదు. ఆపదల నన్నింటిని గడచితిని. మిగిలినయాపద నాశిసుహత్య- వాని నాపదనుండి రక్షిం చినఁ జాలును. ఇంతకు నాకర్మము నన్నెన్నింటియో యుండును.

చ. వనమునవున్న ఘోర రిపు వహ్నుల మధ్యమునందు నున్న, దు ర్జనులకుఁ జిక్కియున్న, జలరాశి మునింగిన, నదిమస్తకం బున నివసించినన్, నిదురఁబోవుచు నుండిన, నెట్టివేళ నేన్ గనుఁగొన పూర్వజన్మకృత కర్మము బ్రోచుచునుండు జీవులన్.

(అవనిక జారును.)



శ్రీ

# మర్దానా.

## ద్వితీయాంకము.



### ప్రథమదృశ్యము.

స్థానము:—ఢిల్లీ రాజప్రాసాదము- గుల్నార్ మందిరము.

[అక్బరుకూతురగు రజియా, గుల్నార్ చెంతగూర్చుండి పాడుచుండును.]

గుల్నార్- రజియా! సంగీతము నీవె ట్లభ్యసించితివి?

రజియా—నాతండ్రివలన నభ్యసించితిని.

గుల్నార్—పాటయనిన నా కసహ్యామే!

రజియా—నీకును, తాతగారికిని గాఢదకున్నంత స్వరజ్ఞానమైనను లేదు. నేను పాడినంతనే తాత నన్నుగొట్టవచ్చును. మీరు మనుష్యులై పుట్టుట మాకును, మావంటి పసివారికిని చేటు కలిగించుటకే.

గుల్నార్—(ఇంచుక కోపము నభినయించి) అధికప్రసంగము చేయక, చక్కనిపాటను పాడుము.

రజియా—(గొంతుక సవరించుకొని)

కాంభోజి — ఆటతాళము.

ప॥ సుందర రారా నిన్ను నమ్మితి నన్నేలురా-
మేలాచలమేలా యిది సమయమురా॥

అ॥ సతతము నీప్రేమపాశము ననుబంధించగా-
కరుణను నీదు కౌంగిటికిం గైకోరా॥

చ॥ సుగుణధామ సరసలోకాభిరామ॥

(అని పాడును.)

[ఔరంగజేబు- అక్బర్ ప్రవేశింతురు.]

ఔరం—(రజియాను చూచి అక్బరుతో) అక్బర్! పరిపాలనాక్రమము నేర్చుకొనునిమిత్తము నిన్ను వంగదేశమునకుం బంపియుంటిని. అట్లు చేయక, నాయాజ్ఞ నుల్లంఘించి నీవు నృత్యగీతాదులం గాలక్షేపము చేయుటయే గాక, నీబిడ్డనుసైతము పాట నేర్పి పాడుచేసినావు. నీ వింతపనికిరానివాండ వగుదువని యెన్నండును దలచలేదు.

అక్బర్ (మౌనము వహించియుండును.)

ఔరం—ఇంకనైన బుద్ధిందెచ్చుకొని మీవారుయుద్ధమున నీనైపుణ్యమును జూపి పేరుపొందుము. నీవెంట నేబదివేలసైన్యమును బంపెదను.

అక్బర్—(అంగీకార సూచకముగ తలనూపును.)

ఔరం—నీవు కేవలము విషయలోలుండవై యుంటంజూచి సహింపజాలక, నిన్ను సన్మార్గమునం బెట్టందలంచి యిచటకు రావించితిని. నీసహాయమునకై దిలేర్ఖానును బంపితిని. నేనును-ఆజమును, దోబారినుండి వచ్చి మిమ్ములం గలసికొందుము. పొమ్ము.

(అక్బర్ నిష్క్రమించును.)

ఔరం—(గుల్నార్‌ను జూచి) గుల్‌నార్ ! నీ నిమిత్తము నేఁడొక ఘోరయుద్ధము జరుగనున్నది.

గుల్—ఘోరయుద్ధమా ! సామాన్యజనపద మగు మీవారును ముట్టడించు టొక ఘోరయుద్ధమా ? చక్రవర్తివంటి వారి కిది యొక తుచ్ఛకార్యము.

ఔరం—ఏనాఁడు స్వల్పసంఖ్యాతసైనికులతో రాజపుత్రులు గణనాతీతమగు మొగల్‌సైన్యముల నోడించిరని వింటినో, అప్పటి నుండి రాజపుత్రులతో యుద్ధము నాగుపాముతో చెలగాటమని యనుకొంటిని. కావుననే కాబూల్‌దేశమునుండి "ఆజిం"ను బంగాళాదేశమునుండి అక్బరును రావించి, లెక్కకు మించిన సేనలతో వారిని యుద్ధమునకు బంపితిని. మీవారుముట్టడి స్వల్పకార్యమని తలంపరాదు.

గుల్—మీవారును మీరు జయించినను, మానినను రాణిని, నామెపుత్రిసిమాత్రము నాపాదముల కర్పింపవలెను.

ఔరం—అందులకే యీ ప్రయత్నము.

## ద్వితీయదృశ్యము.

ఆబూపర్వతమందలి యొకానొకదుర్గము,

[దుర్గాదాసు, ముకుందుఁడు, శివసింహుఁడు సంభాషించుచుందురు.]

దుర్గా—ముకుందసింహా! శివసింహా! మన చిన్నప్రభువుని మీ యిరువురియధీనమందుంచి పోవుచున్నాను. ఈస్థల మతి రహస్యము. ఎరికిని దెలియనీయరాదుసుమీ!

ఉభయులు—మాకంఠమున ప్రాణ మున్నంతదనుక నట్లు కానేరదు.

దుర్గా—చక్రవర్తిసైన్యములు మీవారును ముట్టడింపవచ్చుచున్నవి. కుమారు నుదయపురమం దుంచుట శ్రేయస్కరము కాదని

యెఱింగి, రాణావారియాదేశానుసార మితని నిచ్చటి
కొని తెచ్చితిని.

సీ. తురకపన్నిన కపటవా । గురకుఁజిక్కి-
ప్రాణములఁబాసి గతియించెఁ । ప్రభువరుండు
అతనిపుత్త్రుని నితనిఁ । గాపాడవలయుఁ
గంటికిఱెప్పచందానఁ । గరుణతోడ.

ముకుంద—మీవారుముట్టడికి దగిన కారణములేవి?

దుర్గా—యశ్వంతశింహునిరాణికిని, ‘ నామెతనయునకు నాశ్రమ
మిచ్చుటొకటి. హిందువులపై నత్యాచారములు చేయకూడ
దని కఠినముగ వ్రాసినజాబు రెండవది. రెండవకారణము
ఔరంగజేబుని యుద్ధమునకు ప్రేరేపించుటలేదని రూఢిగా
చెప్పఁగలుగుదును.

ఉభయులు—సేనాపతి! మనప్రభుని ప్రాణరక్షణార్ధ మీ యుద్ధ
మారంభమైనది. ఈవిషయముక మే మప్రమత్తులమై మెలంగె
దము. ఈస్థలము మిక్కిలి రహస్యమైనది. మా సాహాయ్యము
నకు మీరు రెండువందలయోధులనుంచి పొండు. ఇంచు
కైన విపత్తు సంభవించినయెడల మీకు వర్తమాన మంపె
దము.

శివసింహు— చక్రవర్తియు నీరణరంగమునకు వచ్చుచున్నాడా?

దుర్గా—ఔను. చిత్తూరు, మంగళగఢాదిదుర్గములు చక్రవర్తి
వశము లయ్యెను. రాణావారు తమసేనలను పర్వతప్రదేశ
ముల నడపించుకొని వచ్చుచున్నారు.

ముకుంద—మహారాణి యెచ్చట?

దుర్గా— ఆయమ మార్వాడ దేశమునుండి పెక్కు సైన్యములతో
మీవారునకు వచ్చుచున్నది. ఇఁక మీరు భోజనాదికము ల

నోనర్చి నిజకార్యములందు మెలఁకువఁగల్గి మెలంగుచుం పొండు!

(శివముకుందులు నిష్క్రమింతురు.)

దుర్గా—(స్వగతమున) ఆహా! పరమేశ్వరా! ఏమి, నీసృష్టివైచిత్ర్యము! బహుకాలమునకుఁ దిరుగ మీవాన్ మార్వాడదేశము లేకీభవించినవి. ఈసంఘభావము శుభసూచకముగ నున్నది. గణనాతీతములగు మొగల్ సైన్యముల నతిస్వల్పసంఖ్యగల నాసైన్యములతో గెలువలేనేమో యను నిరాశతో నుంటిని; కాని, యీనిరాశాంధకారమును భేదించుటకు, మీవాన్ మార్వాడదేశముల యైకమత్య మను, నాశాదీపక్షీణరేఖ కానవచ్చుచున్నది. కానిమ్ము. ప్రయత్నించి, దీని పరిణామ మెట్లుండునో చూచెదఁగాక! ఉభయదేశసైన్యములను నాశక్తికొలంది ప్రేరేపించెదఁగాక.

మ. సమరోత్సేక విజృంభణంబున నిరాశాదోర్బలోద్రేక వి
క్రమముఁ వెల్లడిఁజేసి మ్లేచ్ఛకదళీ కాంతారవిచ్ఛేదన
క్రమఘాటిఁ బ్రకటించి, హైందవ జనప్రఖ్యాతి స్థాపింపఁ బూ
ర్వము పోరాడిన వీరులం దలఁచి మత్ప్రాగల్భ్యముఁ జూపెదన్.

జయ్. జన్మభూమికిజయ్. (ప్రస్థానము.)

తృతీయదృశ్యము.

రాణారాజసింహుని యాలోచనామందిరము.

[జోధపురపట్టమహిషియు, దుర్గాదాసాదిరాజపుత్ర సామంత గణము నుచితాసనాసీనులైయుందురు.]

విక్రమ—సమ్ముఖయుద్ధమున మొగల్ సైన్యము నెదుర్కొనిన బాగుగనుండునని తలఁచుచున్నాను.

రాణా—అసంఖ్యాతములగు మొగల్‌సైన్యములను సమ్ముఖయుద్ధమున నెదుర్కొనుట సాహస మనిచెప్పఁగలను.

గోపీ—మన స్వల్పసైన్యముల ననేకవిభాగములుగచేసి శత్రువుల మార్గముల నరికట్టుట యుక్తిసంగతమని నాతలంపు.

రాణా—నరేంద్‌దాస్! పర్వతప్రదేశములంగల ప్రతిగృహమును, ప్రతిమార్గమును నీవు బాగుగ నెఱుంగుదువు. నీయభిప్రాయ మేమియో తెలుపఁగోరెదను.

నరేంద్—రాణా! శత్రుసైన్యములను పర్వతప్రదేశములఁ జొరనిమ్ము. ఆసేనలన్నియు నాపథములనుండి బయటికివచ్చుట కవకాశ ముండదు. అపుడు మనము వారి నాక్రమింపవచ్చును.

రాణా—(అందఱనుద్దేశించి) ఈపద్ధతికి మీరు సమ్మతింతురా?

అందఱు—ఆహా! తప్పక సమ్మతింతుము.

రాణా—రాణీ! నీయభిప్రాయమేమి?

రాణీ—అందఱియభిప్రాయమే నాయభిప్రాయము. మీరీయుద్ధమునఁ బాల్గొనరా యేమి?

రాణా—మహారాణీ! శత్రుసైన్యములు మూఁడు విభాగములై మూఁడుమార్గముల మనల నెదుర్కొనుచున్నవి. మొదటిది అక్బరుయధీనమున ఉదయపురమార్గమున నున్నది. రెండవవిభాగమునకు దిలేర్‌ఖాను డధినాయకుండై దోసురీపథమున వేచియున్నాఁడు. దోబారీపథమున స్వయముగఁ జక్రవర్తియే సేనాసమేతుఁడై యున్నాఁడు; కావున నేను మీతో నేకీభవించుట కవకాశము లేదు.

రాణీ—అయినచో నేను నాసేనలతోఁ జక్రవర్తి నెదుర్కొనఁబోవుదును. మీ రేమందురు?

రాణా—గణనాతీత మగుసైన్యముతోఁ వచ్చుచున్న పాదుషాను నెదుర్కొనుట యపాయకరము. ఏమి దుర్గాదాస్ !

దుర్గా - చిత్తము ప్రభువులు సెలవిచ్చినది నిక్కువమే ?

రాణా—అయినచో నీయుభయ సైన్యముల కధినాయకునిగా నెవరిని నియమింపవలయును ?

అందఱు—(ఏకగ్రీవముగ) ఏమీ ! ఏమహాత్ముని నామశ్రవణ మాత్రాన శత్రువులగుండెయలు ఝల్లుమనునో, ఏపరమపురుషునియాజ్ఞ నుల్లంఘింప, నోరులేని జంతుజాలముసహితము మెల్లకుండునో, యట్టి యనుపమానబలపరాక్రముం డగు దుర్గాదాసుఁడుండ, నన్యు లెవ్వ డీయుభయదేశసైన్యముల కధ్యక్షుండుకాసమర్థుఁడు ?

రాణా — దుర్గాదాసవీరాగ్రణీ !

మ॥ పరభూమీధవరాజహంసలకు శంపామాలికాతుల్యమై
గరళగ్రీవ విలోచనా నలశిఖాకారంబునం గ్రాలి, నీ
కరముంబట్టి, సమస్తవైరి కదళీ కాంతారసంహార భీ
కరకార్యాచరణంబునన్ మెలఁగు నీఖడ్గంబు జృంభించుతన్.

[అంత రాణాప్రథమపుత్రుఁడు భీమసింహుని ప్రవేశము.]

భీమ - (తండ్రి కభివందనము లాచరించినపిదప మిగిలినవారికి నమస్కారము చేయును.)

రాణా—(కన్నీరుకార్చుచు) నాయనా ! రమ్ము ! నిన్నుఁ జేరఁబిలచుటకు నైన నాకధికారములేదా. ఔను. నారాజ్యమునుండి నిన్ను పాఱఁద్రోలినపిమ్మట, నిన్నుఁ బిలచుటకైన నా కధికారమెక్కడిది ?

భీమ—తండ్రీ ! అధికారములేదనియా పలుకుచున్నారు ? పరదేశములందు నివసించుచుంటె నన్నుమాటయే కాని, రాత్రింబవళ్లు

సుషుప్త్యవస్థయందేమి, జాగ్రదవస్థయందేమి, భోజనసమయమునందేమి, సంతతము నాదేశము - ఆ మీావారుభూమియందలి ఘనశైలమాలలు - యాటవికప్రదేశములు - సమస్తమును నాకన్నులయెదుటనే తాండవమాడుచుండెడివి. అట్టి నా జన్మభూమికి ముప్పువాటిల్లినపు డామె నాపదలనుండి విముక్తిఁబొందఁజేయుట నావిధికావున, మీారు వర్తమానముఁ బంపిన వెంటనే బయలుదేఱి వచ్చినాడను. భవదభీష్టములను దీర్ప ప్రాణత్యాగమునైనచేయుట నావిధి. ఇట్టి సందర్భమున నన్నుఁ జేరఁడీ పిలచుటకు మీాకధికారము లేదని పలుకుట న్యాయముకాదు.

[ఆసనమునుండి లేచి రాజసింహుడు పుత్రుని కౌగలించుకొనును. ఆసమయమున నతని ద్వితీయపుత్రు డగు జయసింహుఁడు ప్రవేశించును.]

రాణా—(ఆశ్చర్యమున) జయసింహుఁడా!

జయ—(కోపోద్దీపితుఁడై) తండ్రీ! నీ వింతపక్షపాతముఁగలవాఁడవని నేనెరుంగకపోతిని. నీ ద్వితీయపుత్రుఁడు సజీవుఁడైయుండఁగ, వాని దేహమున ప్రతినాళమునందును, క్షత్రియరక్తము ప్రవహించుచుండ, మాతృదేశరక్షణార్థము, దూరముననున్న తనయునికి వర్తమాన మంపి, నా కావార్త లేశమైనను తెలియఁ బఱుపకుండుట పక్షపాతము కాదా—యన్యాయము కాదా?

(అని నిష్క్రమించును.)

రాణా—(సామంతులతో) చూచితిరా, సామంతులారా! విషయలోలుండై రాజకార్యములవంక నెన్నఁడును తిరిగిచూడని జయసింహుఁడీయుద్ధమున పాల్గొనఁడని యూహించి, భీమునకు

వర్తమానముఁబంప, నాపై నెట్టియపవాదమును మోపెనో చూడుము! భీమా! తత్క్షణము రాజ్యమును వీడిపొమ్ము!

భీమ — మాతృభూమికి జయ్! (అనుచు నిష్క్రమించును.)

రాణా — (అందరకును బోవననుజ్ఞ నొసంగి, స్వగతముగ) సరస్వతీ! నీనైపుణ్యముచే జయసింహు నుత్తేజితుని గావింపఁజాలితివి. నిన్నెంతయు మెచ్చుకొంటిని. నివురుగప్పిన నిప్పువలె వాని లో నణఁగియుండిన యుద్రేకానలమును ప్రజ్వలింపఁజేసిన నీచాతుర్యమున కే నెంతయు సంతోషించితిని. కాని వాఁడు తిరిగి నీనుల మాయలలో బడకుండఁ గాచుకొనుము.

(నిష్క్రమించును.)



## చతుర్థదృశ్యము.

చిత్తూరు సమీప కాననప్రదేశము.

[ఔరంగజేబు — దిలేఖర్ఖానుడు — చక్రవర్తికుమారుఁడగు ఆజిమ్-శ్యామసింహుడు నిల్చియుందురు.]

ఔరం — దిలేర్ఖాన్! ఈ యుద్ధమున నీవునైతము నోడిపోతివా?

దిలేర్ — నే నోడుటయకాక సమస్తమును గోల్పోతిని.

ఔరం — అక్బరుసమాచార మేమైన తెలిసికొంటివా?

దిలేర్ — అతనిగూర్చి నేను మిక్కిలి యశుభమును వింటిని. ఆరావళీపర్వతప్రాంతమున నతఁడు రాణావారి రెండవకుమారుఁడగు జయసింహుని హస్తగతుడై బందీగా కొనిపోఁబడి నాడట!

ఔరం — బందీగా కొనిపోబడెనా! హిందూస్థానమునకుఁ గాబోవు సామ్రాట్టగు అక్బర్ రాజపుత్రుల హస్తగతుఁడయ్యెనా?

ఆజిం — (స్వగతము) ఏమీ! హిందూస్థానమునకుఁ గాబోవు చక్రవర్తి అక్బరా? నేఁ డొక నూతనాంశము వెల్లడియైనది.

దిలేర్—శ్రీవారుకూడ పరాజితులై 'దోఖారీ' ని విడచి చిత్తూరుదుర్గము నాశ్రయించిన ట్లున్నది.

ఔరం—దిలేర్! రాఠోర్ సేనాపతియగు దుర్గాదాసు నన్నోడించి, నాసర్వమును గైకొని, తుదకు నాకుఁ బ్రాణాధిక యగు బేగమును కూడ నెత్తుకొనిపోయెను.

చం॥ హయగతి నేగుదెంచి మన యాశ్వికులన్ దునుమాడి యుగ్రుఁడై
జయ మనియార్చి పేర్చి యెక సక్కెములాడి "మదీయరాజ్ఞికిన్
ప్రియమిది" యంచు నన్ గవిసి బేగము వేగమునన్ హరించి ని
ర్భయముగ స్వేచ్ఛగన్ వెడలె వానిపరాక్రమ మింత యొప్పునే.

దిలేర్—జహాఁపనా! దానికై వగవ నేటికి? బహుప్రతగ్గుటచే నీ పర్యాయము మనము సులభముగ ఢిల్లీని చేరఁగలుగుదుము.

ఔరం—ఈయవమానముతో ఢిల్లీకిఁ బోవుటయా? అసంభవము! ఈదుఃఖసమయమున నీవు పరిహాసము లాడకుము. మొగలుల కెన్నఁడు నిట్టియవమానము...

దిలేర్—మీవలనఁ దప్ప మఱియెవ్వరివలనను సంభవించుట లేదు.

ఔరం—నావలనఁ గాదు. ఇందుకు నీవే కారణమవు. దౌర్భాగ్యవశమున నేఁడు మాసేనలకు నీ వధిపతివగుటవలన నవమానము సంభవించినది. యశ్వంతసింహుఁడే బ్రతికియున్నచో......

దిలేర్—శ్రీవారు భవిష్యత్తు నించుక యాలోచించియున్నచో, యశ్వంతసింహుఁడు జీవించియుండెడివాఁడు.

ఔరం—దిలేర్ఖాన్! ఏమనుచుంటివి?

దిలేర్—జనాబ్! నిర్భయముగ పలుకుచున్నాను. వినుడు. వీరమల్-టాడర్మల్-భగవాన్ దాసాది మహావీరుల భుజశక్తిచే

నార్జింపబడిన యీ మొగల్ సామ్రాజ్యమును, ఆత్మాభిమానమును త్యజించి, దేశద్రోహు లయినట్టి శ్యామసింహునివంటి కుటిలాత్ములను స్నేహితులుగఁ జేసికొని, కునీతిని రాజ్యపరిపాలన మొనరించుచున్న తమరు ధ్వంస మొనరించుచున్నారు. జనాబ్ ! ఇఁకనైన మేల్కాంచి, యజ్ఞానతిమిరమును జ్ఞానదీపికచే నశింపఁజేసి, హిందూమహమ్మదీయులను సమభావము నవలంబింపుడు. మీ కేమియు భయముండదు. అట్లుకాక, మీదుశ్చేష్టల నింకను మానరేని, పేరుప్రఖ్యాతులు లేక నశింతురు. మీ శ్రేయోభిలాషినై నిర్భయముగఁ జెప్పవలసివచ్చిన నాపలుకు లాలించిన మేలగును.

జొరం — దిలేర్ ఖాన్ ! ఆవిషయమును గూర్చి బాగుగ నాలోచింతము. ప్రస్తుతము నే నస్వస్థచిత్తుఁడనై యున్నాను. పోయి విశ్రమించెదను.

(నిష్క్రమించును.)

ఆజిం — (అస్పష్టముగ) అక్బరు భావిచక్రవర్తియగునా? ఎన్నటికిని గానీయను. (అని కన్నెఱ్ఱఁజేయును.)

దిలేర్ — షాజాదా! ఏమి యోచించుచున్నారు?

ఆజిం — ఆసంగతిని మీతో జెప్పకూడదు.

(అనుచు త్వరితగతిని నిర్గమించెను.)

[అక్బర్ ప్రవేశించును.]

శ్యామ — బందగీ, షాజాదా!

దిలేర్ — షాజాదా! మీరు శత్రువులచే ఖైదీగాఁగొనిపోబడినారని వింటినే. అది యసత్యమా, యేమి?

అక్బర్ — (నతమస్తకుండై) అసత్య మెట్లగును?

దిలేర్—నైపుణ్యమున తప్పించుకొనివచ్చితిరా?

అక్బర్—లేదు. ఆహా! రాజపుత్రజాతీ! ఏమి నీ దయాశీలత! ఏమి నీ శాంతస్వభావము! (దిలేరువంకతిరిగి) సేనానాయక! పంజరములోని చిలుకవలె నే నాపర్వతమార్గములఁ జిక్కి, ససైన్యముగ నిరాహారుఁడనై చావనున్న సమయమున, జయసింహుఁడు తండ్రిపంపున నాకొఱకు భోజనాదులఁ దెచ్చి, నన్ను క్షమించి విడచినాఁడు. అంతకంటె నేమి కావలయును?

దిలేర్—ప్రాణములతో స్వగృహమును చేరితి నని యానందమొందుచుంటిరా? ఛీ! ఛీ! లోనికిఁబొండు.

(అందఱు నిష్క్రమింతురు.)



పంచమదృశ్యము.

రాజపుత్రశిబిరము.

[జోధపురరాణి—రాణాయు నుపవిష్టులై యుందురు—సామంతగణము తన్నుపరివేష్టించియుండ, మొగల్ సామ్రాజ్యపతాకమును ధరించి దుర్గాదాసు నిలువఁబడియుండును.]

రాణా—మొగలులను మీవారునుండి పారద్రోలి రాజపుత్రుల నుద్ధరించినందులకు, దుర్గాదాసునకు సాధన్యవాదములు.

రాణి—మదభిప్రాయానుసారము, నా వైరియగు గుల్నారును బంధించి తీసికొనివచ్చిన దుర్గాదాసుఋణమును నేను తీర్చుకొనఁజాలను.

రాణా—ఏమీ! దుర్గాదాస్! గుల్నారును తత్పుత్రుని విడువక ఖైదీగ కొనివచ్చితివా?

దుర్గా—రాణా! నేను సేనానాయకుఁడను మాత్రమే. యుద్ధభూ

మిని శత్రుపుత్రులఁ గెల్చుటయు, వారినిపట్టి రాజుల కప్పగించు టయు నావిధి. వారిని విడిచిపెట్టుభారము మీాయది.

రాణా—తక్షణము పోయి, గుల్నారును సగౌరవముగ పాదుషాచెంతకుఁ బంపివేయుము.

రాణి—అట్లేల చేయవలయును?

రాణా—అంతఃపుర నారీజనముతో మన కేమి ప్రయోజనము? అదియుంగాక యబలలను నేను శిక్షింపను.

రాణి—రాణా! ఈ ఘోరయుద్ధ మెందులకు సంభవించెనో, నేను మిమ్ముల నేల శరణుజొచ్చితినో, ఈయుద్ధమున నేనే గుల్నార్ హస్తగతనై యుండినచో నామె నన్నేమి చేసియుండునో, బాగుగ నాలోచించి యామెను విడువుడు. నే నామెను శిక్షింపక విడువను.

రాణా—శిక్షించుటయా!!

రాణి—ఔను. ఏ పాపాత్మురాలు నన్ను గుట్టలనక, పుట్టలనక రాత్రింబవళ్ళనక, యెండవానలనక, యొకచోటునుండి మఱి యొకస్థలమునకు భిక్షుకురాలివలె త్రిప్పించెనో, రాక్షసరూపిణియగు నేస్త్రీ నాపతి పుత్రుల మ్రింగెనో, యట్టి గుల్నార్ బీగమును శిక్షించెదను.

రాణా — ఎట్టిశిక్షను విధింప సమకట్టితివి? ధర్మాధర్మముల విచారించి పాపులకు శిక్షనొసంగుటకు వాఁడున్నాఁడుకదా! వానికృపవలన నధర్మమెన్నటికైన నాశమొందును. వేగిరపడక శాంతి వహించుము.

రాణి—రాణా! ఎట్టిశిక్షను విధించవలయునో నే నాలోచించి పలికెదను. ఆమె ప్రతియంగమునందు సూదులఁ గుచ్చినను,

నాకు తృప్తిలేదు. ధగధగమని మండు దావానలమున జీవములన్నియు నాహుతి యొసగినను నాకు సంతృప్తికలుగదు. ఆలోచించి, యెట్టిశిక్షనొసంగవలెనో తెలిపెదను.

పాపులకు శిక్ష నొసగువారెవరు లేకయున్నారని మీరన్నారు. నిజమే. అతడెక్కడున్నాడు. వజ్రాఘాతము నిరుపేదపైనే కాక, ధనవంతులపైనిగూడ పడుచున్నది. దావానల మొక్క పేదవాని కుటీరమునే కాక ధనికులసౌధములను ధ్వంసముచేయుచున్నది. మహానిల మొక్క మొలకలే కాదు, ఘనమహీరుహములను పెల్లగించుచున్నది. ధర్మాధర్మవివేకము యెక్కడ ? అతడెక్కడ ? అతడు మొట్టమొదట మంచివారల- న్యాయపరుల- కుత్తుకలనే పిసుకును.

రాణా ! ఎన్నటికైన నధర్మము నాశమొందును. ఎప్పుడు నాశమొందును ? ఎంతదనుక వేచియుండగలము ? సరళస్వభావులు శత్రుల నాశ్రయించుచున్నారు. శత్రులు వారివంక చూడనైన చూడరు. సత్య మనృతముయొక్క దాసియైయున్నది ; కాని యనృతమునకు దయరాదు. న్యాయ మన్యాయముతో చిరకాలమునుండియు బోరాడుచుండియు- నోడుచున్నది. పురాతనమగు- భగ్నమగు ధర్మమందిరమున- నధర్మమనెడు జయభేరి మ్రోగుచున్నది. ఇక నెప్పుడు ధర్మస్థాపనమగును ? ఎంతవఱకు వేచియుండగలము ?

రాణా— ఏమైనను సరే, స్త్రీని శిక్షించుటకు నేను సమ్మతింపను.

దుర్గాదాస్ ! తక్షణము వేగమును ఢిల్లీకి బంపివేయుము !

రాణీ— దుర్గాదాస్ ! నీవు నాభృత్యుడవు కాని, రాణావారి భృత్యుడవు కావుసుమీ !

దుర్గా— అట్లుకాదు. ఈయుద్ధమున మే మందఱము రాణావారిసేవకులమే. వారు చెప్పినట్లు నడచుకొనక తీరదు.

రాణి—(కొంతదనుక మౌనము వహించి పిదప) రాణా! నాతప్పు క్షమించుడు! ఉద్రేకపూరితహృదయనై యట్లంటిని. క్షమించుము! కాని, యీనాతీవ్రమనోవేదనను- గాఢమగునా యంతర్దాహమును బాగుగ తెలిసికొని, బేగమును నాసమక్షమున నిలువనిత్తురేని, యామెను విచారించి విడచిపుచ్చెదను.

రాణా—అట్లేకానిమ్ము. (సేవకుని, బేగమును తెమ్మని యాజ్ఞాపించును. వాడు రయమునపోయి బేగముతో ప్రవేశించును.)

రాణి—(గుల్నార్‌తో) బేగంగుల్నారునకు సలాం!

గుల్నా—జోధపురరాణియా?

రాణి—ఔను. ఇంతలోనే మరచితివా? నాపతి పుత్రులనుమ్రింగి, దాహముతీరకుంటచే, నన్నును, నాపసిపాపను చంపుటకై పాదుషాచేత నీమహానాటకమును నాటించిన నీవు, నన్ను, ఇంతలో మఱచితివా? పాపము!! ముద్దరాలవే?

గుల్నా—(దుర్గాదాసు నవలోకించి) ఇతడేనా, దుర్గాదాస్! నన్నిచ్చటికేల తీసికొనివచ్చినారు?

దుర్గా—నేనే దుర్గాదాసును. విచారణ మొనరించుటకు తీసికొని వచ్చితిమి.

గుల్నా—ఎవరియెదుట?

రాణి—నాసమక్షమున "చింతచచ్చినను పుల్లచావలే" దన్నట్లు పలుకు లింకను గాంభీర్యముగ నున్నవే! దుర్గాదాసువంక తీవ్రదృష్టుల నిగుడించుచున్నావేమి? "ఈతుచ్ఛుండు నన్ను బంధించునంతటివాఁడా" యని యోచించుచున్నావా యేమి?

గుల్నా—నేను మీాఖైదీని. ఏమిచేయ నుద్దేశించియున్నారో చేయవచ్చును.

రాణి — ఈయుద్ధమున నేనే నీచేతఁ జిక్కియుండిన, నీవు నా కెట్టి శిక్షను విధించియుందువు ?

గుల్నా — నాపాదోదకమును నీచేఁ ద్రావించియుందును.

రాణి — ఛీ, నాతైడివి. నిన్ను నాయిష్టమువచ్చిన శిక్షకుఁ బాత్రురాలినిజేయ సమర్థురాలనైయైనను, నిన్ను క్షమించి విడిచి పుచ్చుచున్నాను. ఇది మాధర్మము. పొమ్ము !!

(ఒక సేవకుడు గుల్నారును శృంఖలావిముక్త నొనరించి, యావలకుఁ గొంపోవును.)



శ్రీ

# దుర్గాదాస్.

## తృతీయాంకము.



### ప్రథమదృశ్యము.

స్థలి - రాజప్రాసాద పశ్చాద్భాగముననున్న ప్రమదావనము.

[సేనానాయకుఁడు, తహాబరును, యువరాజగు అక్బరును మాట్లాడుచుందురు ]

తహాబర్ — తుదకు మీ రాభూధరమధ్యప్రదేశమున, బోనులోఁ బడిన యెలుకవలె నటునిటుఁ దిరుగుచుండగ, పర్వతాగ్రముల నున్న రాజపుత్రులు మిమ్ములంగని పరిహాసమాడిరి కాఁబోలు !

అక్బర్ — నేను తండ్రియాజ్ఞానుసార మాపర్వతములనుండి నా సైన్యములను తీసికొనిపోవుచుండ, నాకొకసందు కానవచ్చెను. ఆ మార్గమునఁబడి కొంతదూర మేగుసరి కానలకుఁ బోవుటకు మార్గము లేకుండెను. అం దిరువురుమానవులు వరుసను నిలువబడుటకైన వీలులేకుండెను. మరల వచ్చినదారినే పోవుదమని యత్నింపఁగా నాత్రోవయు నరికట్టఁబడెను.

[అజీమ్ ప్రవేశించును]

అజీమ్—అక్బర్! నీ వీవార్తను వింటివా?

అక్బర్—ఏమది?

అజీ—మహారాజయుద్ధమందు నీవోడిపోతివని, తండ్రిగారు నీపై మిగులఁ గోపించుచున్నారు.

అక్బర్—అయిన నన్నేమందురు? నేనొక్కఁడనే యోడిపోతినా? సేనానాయకుండగు దిలేర్‌ఖాను......

అజీ—అతనిపై సైతము తండ్రిగారమితక్రోధమును వహించియున్నారు.

అక్బర్—మరి తండ్రిగారో? మీరో? మీరందఱును విజయము గాంచినారు కాఁబోలు?

అజీ—నేను యుద్ధముచేసి పరాజితుఁడనైతిని.

అక్బర్—నేనో?

అజీ—నీవు సదావిషయలంపటుండవై రణవిద్యానభిజ్ఞుండవైతివని నాన్నగారనుచున్నారు.

అక్బర్—అయిన నన్నేమిచేయమందురు? నేను విషయలంపటుఁడను—భీరువును—అయిన నేమాయె?

అజీ—ఏమియునులేదు; కాని భ్రాతృభావమున నీకు బోధచేయుచున్నాను వినుము. నీపై నత్యంతకృద్ధుఁడైయున్న తండ్రికంటఁ బడకుండుట నీకు శ్రేయస్కరము.

(అని నిర్గమించును.)

తహావర్—కుమారా! పరిస్థితులేమియు బాగుగాలేవు. యుద్ధమున నీ యపజయ మనర్థమునకుఁ గారణభూతమగునని తోఁచుచున్నది.

అక్బర్—అదెట్లు?

తహాబర్—నీకుఁ జక్రవర్తిత్వము సంప్రాప్తించునను మహాదాశయుం డెడిదికదా! ఇపు డది భగ్నముకానున్నది.

అక్బర్—అయినచో నన్యుఁడెవఁడు చక్రవర్తి కాఁగలవాఁడు?

తహా—ఆజిం సంభాషణమును బట్టి యోచింపగా నతడే భావిచక్రవర్తియని తెల్లమగుచున్నది.

అక్బ—ఔను. తండ్రిగారును, ఆజమును, గుల్నారునుసహిత మోడిపోయిన మహావీరులు. రాజపుత్రులు పరమకారుణికులు కావున నామెను విడిచిపెట్టిరి. కాని.........

తహా—ఆజిమ్ పరాజితుఁడగుట నిజమేయైనను, ఆపరాజయము తండ్రిగారిది కారణము. అతడు తండ్రిగారియధీనమున బోరాడెను. కావున కుమారు నేమియు ననఁజాలఁడు. మీరు స్వయముగ సేనాధిపత్యమును వహించి, యపజయము నొందితిరి కావున, తండ్రికి, మిమ్ముల నిందించుట కవకాశము చిక్కెను.

అక్బ—మఱియొక కారణము గలదు. నావలె మద్యపానరతుఁడుకాక. ఆజిము దినమున పదిపర్యాయములు నమాజుచేయుచుఁ దండ్రిగారిని సంప్రీతులఁ జేసికొనినాఁడు. నన్నుఁబోలె నృత్యగీతాదులం దభిరక్తి లేనివాఁడు కావున తండ్రికిఁ బ్రేమపాత్రుఁడైనాఁడు.

తహా—ఆజిమువలెఁ బ్రవర్తించుటకు మీ కేలప్రయత్నింపఁ గూడదు?

అక్బ—రాజ్యపరిత్యాగమున కొడంబడుదును కాని, యానీచునివలె సురను- వేశ్యను- గానమును విడిచిపెట్టను.

తహా—మాటలాడకుఁడు. పాదుషావా రిచ్చటికే వెంచుచున్నారు.

(తండ్రినిగాంచియు, నక్బ రలక్ష్యభావమున నిష్క్రమించును.)

[దిలేల్ ఖానుతో జకరివర్తి ప్రవేశించును.]

ఔరం——ఆహా! సమస్తమును గోల్పోవుచున్నానే! మీవారు యుద్ధమున నపజయమేకాక, మరల దుర్గాదాసు రాథోడువారీను గెలుచుకొనెనా? పురమండలమున, సుజల్ దాస్ రాంహాలుల నోడించెనా?

దిలే——జహాపనా! మనవారి నోడించుటయే కాదు. ఖురానాది పురాణగ్రంథములను కాల్చివేయుచున్నారు. మసీదులను భగ్నము కావించుచున్నారు. శ్రీవారు నిజమతప్రచారమునకై హిందువుల నెన్నికష్టముల పాలొనరించిరో, యంతకు పెక్కురెట్లు మహమ్మదీయు లిపు డనుభవించుచున్నారు.

ఔరం——ఏమీ! మతధర్మములపై సైతము నత్యాచార మొనరించుచున్నారా?

లే——ఈవిషయమున శ్రీవారే వారికిఁ బ్రథమోపదేశికులు. ప్రభువువారు జిజియాపన్నును విధించక, వారిని సమభావమున నేలినచో, రెండుజాతులును భద్రముగ నుండవచ్చును.

ౌరం——(పండ్లు కొఱుకుచు) నాకంఠమున ప్రాణము లున్నంతదనుక ముసల్మానులు ముసల్మానులే! హిందువులు హిందువులే. తహబర్! వెంటనే నీవు కొంతసేనను తీసికొని మార్వాడదేశముపై దండెత్తవలెను. అక్బరును కూడ నాకార్యమందు నియమించితిని. ఈయుద్ధమున నీవు విజయము పొందవేని నీకుత్తుక నుత్తరించి, కాకులకు గ్రద్దలకు నీమాంసఖండముల వెదఁజల్లుదును. ఇది నాచరమప్రయత్నము.

(నిష్క్రమించును.)

౦——దిలేర్! దీనికి మీ రేమందురు?

దిలే — మీవారియుద్ధమున నాకుఁ బ్రియశ్చిత్తమైనది. మీ రొక సారి మార్వాడయుద్ధమును పరీక్షించి చూడుఁడు- రండు. రండు. సావధానముగఁ బ్రసంగించుకొనవచ్చును.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

ద్వితీయదృశ్యము.

ఢిల్లీరాజప్రాసాదాంతఃపురమందు గుల్నారు నివసించుగది.

[ఏకాకినియై, గుల్నారు కూర్చుండును.]

గుల్నారు —

శా. నీమోముంగని చంద్రబింబ మని వర్ణింపఁగ గళంకంబుతో
దేనూతిరింబును, దివ్యమూర్తిసగు ని । న్నేరీతి వర్ణింతు? నన్
వ్యామోహాంబుధినుండి పోవఁదగదే । ప్రాణేశ! ప్రేమించి, యీ
రామారత్నముఁ గౌఁగిలించి రతిసామ్రాజ్యంబుఁ బాలింపవే.

ఆహా! ఆవిశాలవక్షస్థలము- ఆయున్నతప్రశస్త లలాటఫలకము- ఆజాను లంబితబాహుద్వయము- ఆశరీరసౌందర్యమును సంతతము నాకన్నులయెదుట నాదివ్యమూర్తి తాండవమాడుచునే యున్న ది. దుర్గాదాస్! ఒకటిరెండు తక్కువగ, నీయందు ద్వాత్రింశల్లక్షణములును పొడసూపుచున్నవి. దివ్యమంగళమూర్తీ! ఈమొగల్ సామ్రాజ్య మంతయు నెవరి చేతులబడిలో నున్నదో తెలిసికొంటివా? ఏస్త్రీముఖావలోకనమున నెట్టి జితేంద్రియుండైనను చలించిపోవునో, ఏయబలాకరస్పర్శముచే నెంతటి విరాగియైనను సరాగియగునో, ఏలలనాసందర్శనాలాభమునకై చక్రవర్తులవంటివారు భగీరథప్రయత్నముల చేయుచున్నారో, యేనారీమణి సౌందర్యావలోకనమున, వాయుపుత్రునిఁబోలు బ్రహ్మచారులు ముగ్ధులై కృపాకటాక్ష

భక్తికై యుత్కంఠితులగుదురో, ఏ భామారత్న శరీరవిద్యుల్లతాకాంతి ప్రసరణమునకుఁ గాముకపురుషులు కనుల మోడ్చెదరో, యట్టి గుల్నారు నేఁ డీసమస్తసామ్రాజ్యమును నిజేచ్ఛానుసారము పాలింపుచున్నది. అట్టి నేను నీలావణ్యవాగురను దెగఁద్రెంచి, బయటకు రాఁజాలకున్నాను. మిగుల వ్యథఁజెందుచున్నాను. నన్నుద్ధరింపరమ్మా! ఒక్కసారి నాకు దర్శన మిమ్ము. ఆనాఁడు మీవారునుండి నన్ను భద్రముగ ఢిల్లీని జేర్చితివి. నీ వతికారుణికుఁడవు. నీపొందుఁగోరి, నిద్రాహారముల మాని, మదనశరదళితహృదయనై యున్న నన్నొక్కసారి చూడుము. ఏమీ! సౌందర్యమున రతీసమానురాలనగు నేను దైన్యమున నిన్నింత వేడుకొన్నను జాలికలుగకున్నదా? నీహృదయము పాషాణముకంటె ఘనమై పోయెనే! ఛీ ఛీ! ఇక దైన్యమును వహించుటవలన లాభము లేదు. అనతికాలమున నీదర్పము నణఁచి, నిన్ను స్వాధీనపఱచుకొందును; చూడుము.

[రజియా పాడుచుఁ బ్రవేశించును.]

రజి—ఓహో! అమ్మాజాన్! ఎన్నఁడు నొంటరిగ నుండుట కలవాటుపడనిదానవు, నేఁ డేకాకినివై, దీర్ఘాలోచనము చేయుచున్నావేమి?

గుల్నా—కొన్ని దినములవఱకును నే నిట్లుండఁగోరెదను. ఆప్రసంగముతో నీకు పనిలేదు; కాని, రజియా! ఆనాఁడుపాడినపాటను మఱొక్కసారి వినుపింపుము——

రజి—ఓహో! సంగీతముపై నెంతశ్రద్ధ జనించెను? ఒక్కక్షణము తాళుము. లోనికిపోయి వీణను దెచ్చెదను.

(లోనికిఁ బోవును.)

గుల్ — ఔరంగజేబ్ ! తత్క్షణము మార్వాడదేశమునకు నీసమస్త సైన్యములను బంపుము. ఈయుద్ధమున నాపాషాణహృదయుని జయించి, నాయెదుటకుఁ దీసికొనిరమ్ము.

(పటపరివర్తనము.)



## తృతీయదృశ్యము.

[మార్వాడదేశసమీపపర్వతప్రదేశమున దుర్గాదాసుఁడును రాణా పెద్దకుమారుఁడగు భీమసింహుఁడు నిలుచుండి—దూరమున నున్న గ్రామమున జరుగుచున్న కోలాహలమును గాంచుచున్నారు.]

దుర్గా — భీమసింహా ! చక్రవర్తి తనసమస్తసైన్యములతోడను మార్వాడ నాక్రమించుచున్నాఁడు. ఈయుద్ధమున రాజపుత్రజాతి క్షీణించుటయో, యభ్యుదయమునొందుటయో తెలియఁగలదు. ఇది మనకు జీవన్మరణ సమస్య. వీరులందరు నీమహాసమరమునఁ బ్రాణముల నర్పింప నిశ్చయించుకొనవలెను.

భీమ — నే నందులకే వచ్చియున్నాను.

దుర్గా — శిశోదీయవీరాగ్రణీ ! నీ బలపరాక్రమములును, నీ శౌర్యమును, స్వార్థత్యాగమును, చక్రవర్తి కీయుద్ధమున సంపూర్ణముగఁ దెలియజేయవలెను.

భీమ — సేనాపతీ ! మీరు నిశ్చింతతో నుండుఁడు. నాకొఱకు నా తండ్రికొఱకు నారాజ్యముకొఱకును మదీయప్రాణముల నర్పింప సంసిద్ధుఁడనై యున్నాను. నన్ను విశ్వసింపుఁడు. మహారాణి యెచట ?

దుర్గా — యశ్వంతసింహుని మరణానంతరము విచ్ఛిన్నములై — భిన్నములై చెదరిపోయి, రణవిద్యను విస్మరించి యణఁగిమణఁగి

యున్న సైన్యములను కూర్చుటకై, మార్వాడమందలి, ప్రతి నగరమున—ప్రత్యేక పట్టణమున—పల్లెల—నరణ్యములం బరిభ్రమించుచున్నది.

భీమ—నే నొకసారి యామెను చూడవలెను.

దుర్గా—నేఁడే యామెను చూడఁగలుగుదువు.

[సమర్దాస్ ప్రవేశించును.]

దుర్గా—నూతనవిషయములను సంగ్రహించితివా? దాదా!

సమర్—ఔను. తహబర్ఖాన్ పదివేలసైన్యములతో మార్వాడమున కభిముఖముగ వచ్చుచున్నాడు. పిదప నక్బరు కొన్ని సైన్యములతో రానున్నాడు.

దుర్గా—చక్రవర్తి యెచ్చట?

సమర్—ఆతడు లక్షకుమించిన సేనలతో నజ్మీరునం దున్నాడు.

భీమ—సేనాపతీ! మనరాజాసైన్యసంఖ్య యెంత?

దుర్గా—మార్వాడదేశాధినాథుడు మరణించినపిదప, యోధవరులలోఁ జాలమంది వ్యవసాయాదికర్మలచే జీవనమును గడపుచు రణవిద్యను మఱచిపోయిరి. మఱికొంతమంది ప్రవాసముఁ జేయుచున్నారు. ఇపుడు మనసైన్యము ముప్పదివేలకు మించి యుండదు.

భీమ—అదిగో! మహారాణిగారు వచ్చుచున్నారు.

దుర్గా—ఔను. పోయి నమస్కరించుము.

భీమ—ఆహా! ఆదివ్యసుందరవిగ్రహమును—ఆనితంబలంబితకృష్ణ కేశజాలమును—గాంభీర్యమును సూచించు వదనమండలమును—విద్యుద్దీపము లట్లు విరాజిల్లుకాంతియుత మగుచక్షుర్ద్వయమును కాంచిన ప్రతిమానవుడు నామెను మూర్తీభవించిన భరతమాత యని భావింపకుందురా?

[భీమసింహునకును దుర్గాదాసునకును మధ్యను, రాణివచ్చి నిలచుండును. ఆమె వెనువెంట కొంతమందిమనుష్యు లుందురు.]

మను —మహారాణికి జయ్!

(రాణి యొక్కయున్నతాసనమున నిల్చి వీరుల నుద్దేశించి)

రాణి —మార్వాడదేశవాసులారా! నేను యశ్వంతసింహుని రాణిని. హిందూకుశపర్వతప్రాంతమున నౌరంగజేబు నై పుణ్యమున నాస్వామియు, మీపాలకుండు నగు యశ్వంతసింహరాజు మరణ మొందెను. చక్రవర్తియే నాజ్యేష్ఠపుత్రుండగు పృథ్వీసింహునకు విషవస్త్రములం దొడగించి, వానిప్రాణములను దీసినవాండు. నేనును నాకనిష్ఠపుత్రుండు నగు అజితసింహుడును, మార్వాడమును కాపాడుటకు మిగిలియున్నాము. నే నీవిషయమున మీ సాహాయ్యముం గోరి వచ్చితి. మీరు రాజపుత్రులు—వీరులు—ఈదేశము మీయది. మీజన్మభూమి పరపదదళితమగుచుండుటను జూచి నిర్వీర్యులట్లు మిన్నకుందరా? లేక తద్రక్షణార్థము మహావీరులవలె రణరంగమున మీప్రాణముల నర్పింతురా? మార్వాడము నాక్రమించుకొనుటకు పాదుషా లక్షకుమించిన సేనలతో వచ్చుచున్నాండు.

మను—లక్ష కధికమగు సైన్యములతో పోరాడుటయా? అసంభవము! అసంభవము!

రాణి—అసంభవమా! వైదేశికులు మీపై నధికారముచేయుట కొప్పుకొనెదరా? పరదేశరాజులు మీస్వాతంత్ర్యమును చూఱకొనుట కిష్టపడెదరా? ఛీ! ఛీ! రసపుత్రజాతి కిది తగనిమాట. నాప్రభువు సజీవుండై యుండినచో మీ రట్లుపలుక సాహింపను. ఆతనిమాటపై నసంఖ్యాకములగు కరవాలములు విజృం

భించి యుండును. దూరముగ నాతనియశ్వము కనఁబడినతోఁ డనే జయజయధ్వానము లాకసమున ప్రతిధ్వనించియుండును. ఆతని విధవను, స్త్రీమాత్రురాల నగు నామాటను మీ రేల నాలకించెదరు! మీకు సాహస మెక్కుడిది.

సీ. రిపుబాణములకు దు । ర్భేద్య మగు కవచంబు
జయలక్ష్మి నివసించు । సారసంబు
తులలేని సుఖసంప । దల కాలవాలంబు
సకలకార్యంబుల । సాధనంబు
సంకల్పసిద్ధులో । సంగునాకకుజంబు
పిఱికిపందలకుఁ బ్రి । తిక్ష్వేడనంబు
సజ్జనుల్ నుతియించు । సత్కీర్తి సదనంబు
అఖిలసుగుణంబుల । కాకరంబు

గీ. హానిజలదంబుఁ దోలు ఝం । ఝానిలంబు,
అమలరణమార్గ శిక్ష కా । చార్యకంబు
వీరవరులకు గౌరవ । కారణంబు
సకలరిపుచక్రవిలయంబు । సాహసంబు.

సను—మహారాణి మమ్ము క్షమించును గాక! మే మామెయాజ్ఞ నుల్లంఘింపము.

రాణి—అట్లయిన, మేల్కొనుడు! లెండు. కరవాలము నెత్తుఁడు! భయంకరరణనదప్రశ్రవణమున సర్పము పడగనెత్తినట్లు లెండు! ఘోరమేఘగర్జనముచే, పర్వతకుహరముల లీనమైయున్న ప్రతిధ్వని మేల్కొనినట్లు లెండు! ఝంఝామారుతము వీచుటచే సముద్రమునందలి యల లుప్పొంగినట్లు మేల్కొనుడు! మీలోఁ గాంతివిహీనమై యణఁగియున్న శౌర్యానలమును జయభేరీస్వనవాతూలమున ప్రజ్వలింపఁ జేయుఁడు!

మను—మహారాణి! అట్లే చేయ సంసిద్ధులము. ఈయుద్ధమందు జయ ముపొందెదమను నాశను త్యజించి, మరణమునకు సిద్ధముగ నుండవలెను.

రాణి—ఔను. స్వేచ్ఛకొఱకు— స్వదేశము నిమిత్తము- పరులకై— కర్తవ్యముకొఱకు మరణించువారు పరస్వర్గమును పొందెదరు. మాతృభూమిపట్ల నభిమాన మున్నవారిని— స్వధర్మము నుద్ధరించు సంకల్పముఁ గలవారిని—స్వాతంత్ర్యముకొఱకు ప్రాణములఁ ద్యజించువారినే నేను 'రం' డని యాహ్వానించెదను. అట్టి యుదారపురుషు లెవ్వరైన గలరేని, కంఠము నెత్తి "మాతృభూమికిజయ్!" అని యొక్కసారి జయశబ్దమును మ్రోగింపుఁడు.

సీ. ప్రళయసంధ్యాకాల । భయదతాండవలోల
కాలకంధరపాద । ఘట్టనములు
కబళితాఖిలజీవ । కల్పాంతకోద్దండ
బాహుదండద్వయా । స్ఫాలనములు
బ్రహ్మాండభాండోద్ధ । రణకాలసంరంభ
దంభవరాహావి । జృంభణములు
నిర్ఘాతసంఘాత । నిర్భిన్నభూగర్భ
పర్జన్యభీషణ । గర్జనములు

గీ. ఆగ్రహోదగ్రభైరవ । విగ్రహోగ్ర
వదన గహ్వరజనిత భం । భం స్వనములు
ప్రణుత రసపుత్రవీర ని । ర్వక్రవిక్ర
మాహవక్రమంబునకుఁ దో । డౌనుగాక.

మ. దళితానంతదిగంతమై ధణధణం । ధాణం ధణధ్వానమై
ప్రళయాభీలపయోద నిష్ఠురరవ । ప్రారంభసంరంభతా

నిలయంబై, రిపురాజకర్ణయుగళీ । నిర్ఘోష నిర్ఘాతమై
చలితారాతివితానమైన రణని । స్వానంబు మోగింపుడీ.

[తెరలో రణభేరి]

అందఱు — మాతృభూమికి జయ్ !

(నిష్క్రమింతురు.)

## చతుర్థదృశ్యము.

[మీవారున నొకగిరిదుర్గముచెంత, శిలానిర్మితమగు నొకవిస్తీర్ణ వేదికపై నుపవసించి, వినిర్మల, శీతల చంద్రికల ననుభవించుచుఁ గమలాజయసింహు లుపవిష్టులై యుందురు. కమల గానముచేయును.]

కమ — నాథా ! నాసంగీతము భవదీయకర్ణముల కింపుగ నున్నదను కొనియెదను.

జయ — లేకేమి ! నీమృదుమధురగాన మనెడు మోహనమంత్రము చేతనె గదా, స్వభుజాశక్తియందు, దిగంతవిశ్రాంతయశో వంతుఁడగు, రాజసింహునిపుత్రుఁడ నగు నేను, నిజమానుష మును గోల్పోయి, స్త్రీలోలుండ నను నిందకుఁ బాత్రుఁడ నైతిని !

కమ — (ఇంచుక కోపము నటించుచు) అంతటి దుర్మార్గురాల నగు నేను మీచెంత నుండుటకుఁ దగను. (లేచి పోవుచుండ జయ సింహుఁడామె చీరకొంగును పట్టుకొనును.)

జయ — కమలా ! నేను సత్యమును పలుకుచున్నాను. ఆగ్రహింపకుము. మార్వాడదేశమాతకు సంకటము చేకురెనని, తద్రక్ష ణమునకై తండ్రిగారు నన్ను రణరంగమునకుఁ బోవ నను జ్ఞ యొసంగినను, నతని యాజ్ఞ నుల్లంఘించి, [illegible]

మా వంశమునకును మచ్చఁ దెచ్చితిని. ఆహా! ఏమి నీమోహాన మంత్రిపరిభావము !

[సరస్వతి ప్రవేశించును. కమలా మెనుచూచి యచటినుండి నిష్క్రమించును.]

సర—నాథా !

జయ—ఏమి, సరస్వతీ !

సర—మార్వాడయుద్ధపరిణామమును వింటిరా ?

జయ—లేదు. తెలియఁ జెప్పుము.

సర—(వదనమున ఖేదచిహ్నములు పొడసూప హీనస్వరమున) మార్వాడదేశము విజయము కాంచెను ; కాని, మీసహోదరుఁడు భీమసింహుఁడు మృతిఁ జెందెను.

జయ—(కన్నీరు కార్చుచు) హా! మహోదారవీరసింహా! భీమసింహా! స్వర్గధామమును చేరి సౌఖ్యముండుము !

సర—మఱి మీరో ?

జయ—సఖి ! నాకు నరకప్రాప్తియని వేరుగఁ జెప్పవలెనా! అదిగో సమరదాసాదులిచ్చోటకే తెంచుచున్నారు. వారిని చూచుటకు నాకు కరము లజ్జ పొడముచున్నది. పోయెదను.

(సరస్వతీజయసింహులు నిష్క్రమింతురు.)

[రాజసింహుఁడు, జోధపురరాణి, సమరదాసుడును ప్రవేశింతురు.]

రాజ—రాణీ ! ఈస్థానము నలంకరింపుము. మాభీముఁడు సర్వదా యీవేదికపైనే కూర్చుండెడివాడు.

రాణి—రాణా ! భీమసింహుని పవిత్రచరిత్రము హిందూదేశవీరాగ్రేసరులచరిత్రములవలె స్వర్ణాక్షరముల లిఖింపఁదగినది.

రాజ—మ రెక్కడి భీమసింహుఁడు? ఇఁక నే నామరణము వాని కొఱ కు వగచుచుఁ గాలము వెచ్చింపవలసినదే.

రాణి—క్షత్రియులకు రణక్షేత్రమునఁ జచ్చుటకంటె గౌరవనీయమగు విషయ మింకొకటిలేదు. భీమసింహుఁడు మత్పుత్రుఁడై, వే రొకమరణమును పొందియున్నచో, నేను దుఃఖించెడుదాన నే, కాని యుద్ధమున ప్రాణములఁ గోల్పోయిన సంతానము నకై యంతగా దుఃఖింపవలసిన పనిలేదు.

రాజ—సమర్దాస్! మాభీముఁ డెట్లు యుద్ధ మొనరించెనో వర్ణింపు ము! విని యానందించెదను.

సమ—రాణా! అట్టియుద్ధమును నే నెన్నఁడును చూచియుండలేదు. అది రాత్రిసమయము. ఆకసము నల్లనిమేఘములచే నావరిం పఁబడియుండెను. ఎడతెగని వర్షము కురియుచుండెను. విశ్వ మంతయు నంధకారమున లీనమైపోయెను. అట్టి ఘోరాంధ కారబంధురసమయమున భవత్పుత్రుఁడు, మే మెన్నిసారులు నిరోధించినను, లక్ష్యపెట్టక, పదివేలసైన్యములతో మొగలు శిబిరము నాక్రమించెను. శత్రుసైన్య మొకలక్షకంటె నధి కము!

రాజ—తదుపరి ?

రాణి—మాతృభూమికి జయ్! అటుతరువాత ?

సమ—తదుపరి మాకు కరవాలముల ఝంకారధ్వని వినవచ్చెను. ఆవెనుక తత్కరవాలసంఘర్షణజనితస్ఫులింగముల కాంతులు కానవచ్చెను. ఆకాంతిలేశముచే రుధిరప్లావితమగు రణరంగ ము మాకుఁ గన్పట్టెను. క్రమక్రమముగ శత్రువుల యార్తనా దములు మాకర్ణపుటముల సోకెను. అంతలో నానినదములు వర్షధారాధ్వనులలో లీనములయ్యెను.

రాజ—అలనాఁడు మాభీముఁడు "ప్రవాసముచేయుచున్నను, నా దేశమునకై ప్రాణదానముచేయ సంసిద్ధుఁడ" నని పలికెను. అటుపిమ్మట?

సమ—కొంతసేపటికి, తటిల్లతాకాంతుల సాహాయ్యమున, మాకు రుద్రాకారుఁడై, తనపదివేలసైన్యములను, పదిలక్షలుగా తోప శతృవుల నదేపనిగ విచ్ఛేదముకావించుచున్న భీమసింహుఁడు కనఁబడెను. తోడనే నేను కొంతసైన్యముతో వానిసహాయ్యమునకై పోయి, శిబిరమును జేరి చూచుసరికి, మొగల్ సైన్యములు చెదఱిపోవుచుండెను. శిబిరమున నెవ్వరును లేరు. రణక్షేత్రమును వెదుకగా భీమసింహుని మృతదేహము కాన్పించెను.

రాణా—హా! పుత్ర! హాపుత్ర! (మూర్ఛిల్లును.)

(అవనికాపతనము.)

పంచమదృశ్యము.

స్థానము:—మొగల్ శిబిరము.

[ఇరుపురుబ్రాహ్మణులు సంభాషించుకొనుచుందురు.]

మొదటిబ్రాహ్మణుఁడు—ఇదిగో! సూర్యనారాయణావధాన్లు! బహుకాలదరిశన మిప్పించేరు. తెల్లవారిలేవగానే మాకు మొదట మీముఖసందర్శనం ఔతుండేది. అలాంటి దిన్నాళ్ళు వచ్చి మసముద్రంలోనే ఉండిపోవడంచూస్తే ఏదో విశేషం ఉన్నట్లు తోచుతుంది.

సూర్య—అన్నగారూ! మీరు పండితులుకాబట్టి కల్పనాచాతుర్యం చూపిస్తున్నారు కాని, విశేషా లేవున్నాయండీ? కొంచెం

శౌఖ్యాంపనిమీాద గన్నవరం వెళ్ళవలసివుండెను. అందుచేత ఆలస్యంఅయిపోయింది.

**మొ**సటి—మీారన్ని సంగతులలోనూ జోక్యం కలిగించుకొంటారు. అదేమిటి, తలకాయ తడువుకుంటున్నారేమిటి? అవురంగజేబు మన్నందరినీ తురకాళ్ళను చేసేడు; అందుకు విచారిస్తే లాభంలేదు. ఆమాటకేంగాని, దావామాటెత్తేరు. ఆదావా ఎవరెవరికి? రాజ్యంకోసం ఆజమున్నూ అక్బరున్నూ తగవులాడుకోలేదుకదా?

సూ—ఆఁ! బాగా జ్ఞప్తికి తెచ్చేరు. మార్వాడయుద్ధంలోకూడా, ఓడిపోయినందులకు, అక్బరుకున్నూ, తహాబరుఖానుకున్నూ కొంచెంరోజుల్లో కట్నాలు దొరుకుతాయని విన్నాను.

**మొ**—మీారన్నమాట నాకు బోధపడలేదు.

సూ—ఔరంగజేబు అక్బరుని సింహాసనంమీాద కూర్చుండబెట్టాలని అనుకున్నాడు; కాని ఇపుడు ఆజిముకే రాజ్యం ఇస్తాడట! తహాబరుఖాన్కు దెబ్బలపెళ్ళి చేస్తాడట!

**మొ**—అయితే భయంలేదు లెండి. ఈసమయంలో పీళ్ళిద్దఱూ దుర్గాదాసుని బ్రతిమాలుకుంటే మనబ్రాహ్మాళ్ళని పీక్కుని తింటూన్న చక్రవర్తివంటివాళ్లని పదిమందిని ఒక చూపు చూసేస్తాడు. రాజపుత్రులతో ఈతురకముండాకొడుకులు యుద్ధం చేయగలరటండీ!

**సూర్య**—వాళ్ళకి మనం చెప్పాలి. దుర్గాదాసుదగ్గఱి కప్పుడే అక్బరు ప్రయాణమైనాడట! మీారన్నమాటకి మాత్రం నే నొప్పుకోనండీ! రాజపుత్రులు తురకలతో రారు. వాళ్ళదంతా దొంగయుద్ధం.

మొ—అది దొంగయుద్ధం కాదండీ; అవన్నీ వాళ్లయుక్తులు. తురకల్ని పోగడ్డానికి మీరు నిజంగా భట్రాజులే సుమండీ !

సూ—ఏవిగో ! పండితుడవని వూరుకుంటూంటే నీకు నోటిదురుసు మహాజాస్తిగావుంది. నాతడాఖా చూపట్టాను కాసుకో. తురకాళ్ల బలం నాకన్న నీ కెక్కువ తెలుసునా యేమిటి ?

మొ—నీ కెంతబలంవుందో ఆవస్తూవున్న అక్బరుదగ్గిఱ చూపించు నీగర్వం అణగ్గొట్తాడు.

సూ—వాడికి నాకు చాలాస్నేహం. వాడురానీ నీపనిపట్టిస్తా.

[మొదటిబ్రాహ్మణుండు నిష్క్రమించును. కిరీటధారియై, సురాపాన మత్తతచేఁ దూలుచు, అక్బరు ప్రవేశించును.]

అక్బ—అరే బొమ్మన్ ! హంకీ పాదుషావాడూ అని పిల్వాల. నాది పాదుషానంబరు ఎక్టి.

సూ—చిత్తము. పాదుషా అంటె తమరే పాదుషావారు.

అక్బ—ధత్, సువర్ ! రెండుపాదుషా ఎక్డాబే ? ఒకటిమాట సెప్తవు లేదు. (కాలితోఁ దన్నుచు) కౌన్ హైరే ? (ఎవరక్కడ?)

[సేవకుండు ప్రవేశించి] జీ, హుజూర్ !

అ—ఇసోకొదూర్ హటావో (వీని నావలకు గెంటివేయుము.)

(సేవకుడు సూర్యనారాయణావధాన్ల నావలకు గెంటును.)

అ—అరే ! జొరె మదిరా లావో ! (ఇంకాసారాయిని తెమ్ము)

[సేవకుడట్లు తెచ్చియిచ్చును. అక్బరు కల్లుఁ ద్రాగుచుండ తహాబత్ ఖాన్ ప్రవేశించును.]

త—ఓహో ! షాజాదావారా ? సలాం !

అ—ఐ ! తూ ఏక్ ఖూబ్ సురత్, ప్యారీ కోలానా ! (ఓయీ నీవొక యందకత్తెయగు వేశ్యను తెమ్ము.)

తహ—(క్రోధమున) ఛీ! మూర్ఖ! నాచేత—నీమేలునుకోరి, నిన్ను చక్రవర్తినిచేయ నుద్దేశించియున్న నాచేతనే, నీచకృత్యములఁ జేయింపఁజూతువా?

అక్బ—అరే! నౌఖర్! యే ఘమండ్ కర్తాహై. ఇస్కో—భీభీహాతాదో! (సేవకా! వీఁడు మిగుల గర్వించుచున్నాఁడు. వీనిగూడ గెంటివే యుము.)

తహ—నన్ను నీవు గెంటెదువా? విశేషసురాపానజనితమదోన్మత్తుండవై నన్నుగెంటెంతువా? తులువా! మనమిట్టి నీచకార్యములను చేయుటచేతనేగదా, పవిత్రహిందూజాతి మనలనిట్లు నిరసించుచున్నది? కానిమ్ము, బికానీరురాజగు శ్యామసింహుని చేత నొకజాబు వ్రాయించి, రాజపుత్రులు నిన్ను గెంటివేయునట్లు జేసెదను. (అని త్వరితగతిని పోవుచుండును.)

అక్బ—అరే! అరే! అరే! ఠైరో! అరే! బాత్ నైమాన్తాహై? మైఁ పాదుషాహూఁ. నౌకర్! చలో! చలో! (ఆసనమునుండి దిగి నౌకరువెంటరా, తహాబరును వెంబడించును.)



## షష్ఠదృశ్యము.

ఆజ్మీరునందు, ఔరంగజేబు భవనము.

[శయనాగారమున నొకతల్పముపై మేనువాల్చి, దిలేర్ఖానుతోఁ జక్రవర్తి మాట్లాడును.]

ఔరం—ఆహా! కన్నకుమారుడే నన్ను మోసపుచ్చి, శత్రుపక్షమున జేర, నన్యులసంగతి చెప్పుట కేమున్నది? అక్బర్! రాజపుత్రుల సహాయమున, నన్నోడించి, సింహాసనారూఢుడవయ్యెదవా? నేనేమి యపరాధము నొనరించితిని? మొగల్ సామ్రాజ్యమును నీయధీనమం దుంచుట కేనుపడిన కష్టములను,

పన్నిన పన్నాగములను, నీవు మఱచిపోతివా ? తండ్రీ! నీకె
వరిట్టి కునీతుల బోధించిరోగదా! (దిలేరు నుద్దేశించి) సేనా
నాయకా! రాజపుత్రశిబిరమునుండి క్రొత్తసమాచారము
లేమైన వచ్చినవా ?

దిలేర్ — లేదు.

ఔరం — అక్బర్! నీవింత ద్రోహము జేతువని నే నెన్నడు ననుకొన
లేదు.

దిలే — జహాఁపనా ? శ్రీవారు మొగల్ సామ్రాజ్యసింహాసనమును
పొందుట కెన్నిమాయోపాయములఁ బన్నుటలేదు. సహో
దరులనే హత్యకావించిరే! తమపుత్రుఁడగు అక్బరు నామా
ర్గమునే యవలంబించెను.

ఔరం — దిలేర్! సావధానుఁడవై మాటలాడుము.

[శ్యామసింహుఁడు ప్రవేశించును.]

ఔరం — మహారాజా! ఏమైన వింతలా ?

శ్యా — ప్రభూ! కార్యము సఫలమైనది. కలనైన నట్లగునని యు
హించలేదు.

ఔరం — ఏమీ! రాజపుత్రు లక్బరును పరిత్యజించిరా ? అదెట్లు?

శ్యా — జహాఁపనా! "మీయెడల స్నేహభావమునఁ బ్రవర్తించుచుఁ,
జక్రవర్తిపై మీరెప్పుడైనను, దండెత్తవచ్చినపుడు, మిమ్ముల
మోసపుచ్చుటకై అక్బరు ప్రయత్నించుచున్నాడు. జాగ్రత."
ఇట్లని నేనొక జాబును లిఖించి, రాజపుత్రశిబిరమున కేగి
తల్లేఖను సమర్దాసున కొసంగితిని. అందలి విషయములను
విశ్వసించి, యక్బరును వారికడకు పంపుట తమ పన్నుగడ
యని యూహించి సమర్దాసాదులు యువరాజున కాశ్రయ
మిచ్చుటకు సమ్మతించుటను మానిరి.

జౌరం—అజాబును దుర్గాదాసుకూడ విశ్వసించెనా ?

శ్యా—అతఁ డాసమయమున నుదయపురమం దుండెను.

జౌ—తహబర్ ఖాను డెచ్చటనున్నాడు. నాపుత్రుని కీకుమంత్రముల నతడే యుపదేశించెను.

శ్యా—"నీవు కొందఱు రాజద్రోహులతోఁ దిరుగుచున్నట్లు పాదుషా వారు తెలిసికొని, యీజాబు నందుకొనినవెంటనే యతని సాన్నిధ్యమున, క్షమాపణముఁ గోరుకొనవేని, నీకు గఠినశిక్ష విధింపనున్నా"రని తహబరుఖానునకు లేఖ నంపితిని. అద్దానిం గని యతఁడు (శ్రీ)వారిదఱికి వచ్చుచుండ, మార్గమధ్యమున, నేనును, ఆజిమును, అతనిని బంధించి, కారాగృహమం దుంచితిమి.

జౌ—బికానీర్ మహారాజా! మీకు నేనెంతయుఁ గృతజ్ఞుండను. (ఆవల జనకోలాహలమును గాంచి) ఏమది ? తుపాకిశబ్దము వినవచ్చుచున్నదేమి ?

[రుధిరసిక్తశరీరుఁడై తహబరుఖాను ప్రవేశించును.]

జౌ—తహబర్ !

త—(చేతనున్న తుపాకిని చక్రవర్తిశిరమున లక్ష్యముంచును.)

జౌ—ద్రోహీ !

త—(తుపాకిని పేల్చబోవుచుండ, దిలే రొఱనుండి కత్తినిదూసి, తహబరును కొట్టబోవును. తహబర్ త్వరితగతిని పాఱును.)

జౌ—ఆహా ! ఏమి యీమూర్ఖుని సాహసము ! నన్ను హత్యకావించి, అక్బరునకుఁ జక్రవర్తిత్వము నొసంగనమకట్టి, ద్వారపాలకులను హతమొనరించి, నిర్భయముగ లోనం బ్రవేశించెనే! దిలేర్ ! నేడు నీవు లేకున్నచో నేనొకతుచ్ఛుని హస్తమున

[పరివారయుతుఁడై అక్బరు ప్రవేశించును.]

అ—(దుర్గాదాసునకు నమస్కరించి) రాథోర్ సేనాపతి ! బంధుజన తిరస్కృతుండనై, తండ్రికి విప్రియుఁడనై, సహాయము నభిలషించి మీశరణుజొచ్చిన నన్నిట్లు నిరాకరించుట ధర్మమా ?

దు— (శ్యామసింహ లిఖితమగుజాబును యువరాజునకుఁ జూపును.)

అ—(ఆజాబును చదివికొని) ఇది కేవలము మిథ్య. నన్నుభయభ్రష్టుని చేయఁబూని వ్రాసిన కపటలేఖ.

(అక్బరు కొమరితయగు రజియా కన్నీరు గార్చుచు)

రజి—రసపుత్రవీరాగ్రేసరా ! తండ్రిగారి కభయ మిడుము. ఆజాబు నిజమగునది కాదు.

అ—దుర్గాదాస్ ! నన్ను నడిసముద్రమున ముంచివేయకుము- ఆశ్రయదాన మొసఁగుము.

దు—సామంతులారా ! మీయభిప్రాయ మేమి ?

సా— అక్బరు తండ్రిచెంతకుఁ బోయి క్షమార్పణము కోరుకొననిండు.

దు— సమర్దాన్! ఇందుకు నీవేమందువు ?

స—అతని కాశ్రయమిడుట పామును పాలుపోసిపెంచుటయు నొకటే యని నాయభిప్రాయము.

దు—మీరుక్షత్రియులు కానేరరు. మిమ్ములనిందించిన ఫలమేమియు నులేదు- మనపాదములవ్రాలి శరణువేడుచున్న శత్రువునకాశ్రయదానము చేయుటయ క్షత్రియధర్మము. ఇదిగో! నేను మిమ్ములనందఱను పరిత్యజించి, పోవుచున్నాను. (అక్బరు నుద్దేశించి) యువరాజా! ఈదుర్గాదాసు సజీవుఁడైయున్నవఱకును నీకెవ్విధమగు నపాయము చేకురదు. రమ్ము! పోదము.

(సపరివారముగ నక్బరువెంటరా దుర్గాదాసు, శిబిరమునుండి నిష్క్రమించును.)



శ్రీ

# దుర్గాదాస్

## చతుర్థాంకము.



ప్రథమదృశ్యము.

స్థానము:—ఢిల్లీ—దర్బారుభవనము.

[చక్రవర్తి తనయుఁడగు ముఆజిము—సేనానాయకుఁడు దిలేరు ఖానుఁడు సంభాషించుచుందురు.]

దిలే—అయిన, దుర్గాదాసుఁ డక్బరును వెంటనిడికొని దాక్షిణ్యా నకుఁ బోయెనా?

ముఅ—అక్బరున కాశ్రయదానమొసంగుటకు రసపుత్రసామంతగణ మియ్యకొనుటలేదు. ఇఁక నతని పరీక్షించువాఁడు శంభాజీమహారాజు తప్ప వేరెవరును లేరు.

దిలే—దుర్గాదాస్! నీపరోపకారమునకు నేను మిగుల హర్షమొందుచున్నాను. నీజీవితము ధన్యమైనది—పవిత్రమగునది. ఆశ్రితుఁడగు శత్రుపుత్రుని ప్రాణసంరక్షణార్థము, నిజసహోదరసామంతగణమును—స్వదేశమును కూడ పరిత్యజించితివిగ ఆహా! నీ నామోచ్చారణ మొనరించుటచే నాపాపము [illegible]యు నశించిపోయినవి. భగవంతుఁడు నీకు మేలుసేయుఁగాక

ముకుం — అతని కృత్య తాప్తులును, అతని నిమిత్తము ప్రాణత్యాగము నకుఁగూడ సంసిద్ధులైనవారును, ఐదువందల రజపుత్రులుం డిరి. ఆస్వల్పసైనికభటసహాయ్యమున నతఁడు దాక్షిణాత్యము నకుఁ బోవుచుండ, ససైన్యముగ నేనాతని బంధించితిని. అయిన నెట్లెట్లులో, అతఁ డొకనాటిరాత్రిసమయమున నిజ పరివారముతో, మాసైన్యముల భేదించుకొని పోయెను.

దిలే — దుర్గాదాస్ ! పవిత్రమగు "వీర" శబ్దమునకు నీవే తగుదువు.

ముకుం — తండ్రిగారు రేబదివేలరూపాయలను రాఠోరుసేనాపతికి బంపి, అక్బరును విడిచిపెట్టవలెనని బ్రతిమాలుకొన్నను, తద్ద్రవ్యము నతఁ డక్బరున కొసంగి, తండ్రిగారి ప్రార్థనమును నిరాకరించెను.

దిలే — దుర్గాదాస్ ! ఏమి నీయౌదార్యము ! ఇదిగో, మరల నీకు ధన్యవాదము లొసంగుచున్నాను.

ముకుం — ఇపుడు మార్వాడదేశసైన్యాధ్యక్షుత సమర్థాసున కొసఁగఁబడెను. అక్బరు, భార్య మరణించుటచేఁ గుమార్తెను సమర్థాసు నొద్ద విడచిపోయెను.

[ఆజిం ప్రవేశము]

ఆ — సేనాపతీ! రాజపుత్రికులతో మొగలులకు సంధి సేర్పఱుపమని తండ్రిగారు మీతో చెప్పుమనిరి.

ది — పరమేశ్వరుఁ డాతనికి శుభమొసంగుఁగాక; అయినచో, సంధికి తొలుత మనమే గడంగవలయును. విజయులగు రాజపుత్రు లెన్నఁడును సంధిభిక్ష నడుగరారు.

ఆ — అట్లుకాదు. రాజపుత్రులే మొదట సంధిషరతులను నిర్ణయింప వలెనని తండ్రిగారి యాజ్ఞ.

— అది యసంభవము. ఇది పూర్వమువలెనే కపటప్రయత్నముగఁ

దోఁచుచున్నది. విజితులు తొలుత షరతుల నేర్పఱచి సంధికి గడఁగవలెను.

ఆ—యిా రథికప్రసంగమును చేయక, పాదుషాయాజ్ఞ నిర్వహణ మొనరింపవలెను.

వి—(చిఱునవ్వు మొగమునఁ దోప) పులిపిల్ల పులిగాక మఱేమగును. సాహెబా! నిక్కముగ తండ్రిగారు రసపుత్రికులతో సంధికి సమ్మతింతురేని, నే నుభయజాతులమధ్యమున నెట్టికలహము లును, భేదాభిప్రాయములును లేకుండ సంధిప్రయత్నముల సలుపుదుననియు, నిందేదైన మోసము కన్పడినచో, సీకార్య ము నాచే కానేరదనియు, నామాటలుగ తండ్రిగారితో నుడు వుము.

(నిష్క్రమించును.)

ముల—(ఆజముతో) ఆజిం! తండ్రిగా రింతశీఘ్రముగ సంధిప్రయత్న ములఁ జేయఁగోరుటకుఁ గారణ మేమైయుండును?

ఆ—ఆతఁడు దాక్షిణాత్యమున కత్యవసరముగఁ బోవలెను—

ముల—అక్బరును తిరిగి తీసికొనివచ్చుటకుఁ బోవుచున్నారా యేమి?

ఆ ఔనన్నా. నీవక్బరును నిజేచ్ఛను విడచిపెట్టితివని, తండ్రిగా రభి ప్రాయపడుచున్నారు.

ముల—అది సత్యమేయగును. రాజ్యతంత్రానభిజ్ఞుఁడును- అమాయి కుఁడును- దుర్బలుఁడు నగు నాసహోదరుని, జీవములతోఁ దండ్రిగారి క్రోధాగ్నిజ్వాలలఁ బడవేయ నామనం బొప్పకుం డెను. ఇప్పుడు వాఁడు మహోదారుఁడగు దుర్గాదాసుని భుజచ్ఛాయను నిర్భయముగ నున్నాఁడు.

ఆ—అయిన తండ్రిగారి యాజ్ఞ నుల్లంఘించుటకు నీవుభయంపడవా?

ముల—చక్రవర్తి నాకుఁ దండ్రి. అక్బరు నాకు సహోదరుఁడు ఇంకఁ జెప్పుటకు నేమున్నది.

(ఇరువురు పానముతో వెడలుదురు.)

## ద్వితీయదృశ్యము.

స్థానము—జోధపురమందలి ప్రాసాదము

[రాణి పట్టువస్త్రముల ధరించి, ఏకాకినియై యుండును ]

రా—(నతమస్తకయై చేతులజోడించి) ప్రభూ! ప్రాణవల్లభ! ఒక ప్పుడు మీరు పరాజితులై రణక్షేత్రమునుండి మఱలిరాఁగా నేను దుర్గద్వారమును బంధించి, "రసపుత్రకులు గెలుప నిదే తమయిండ్లకు మఱలిరారు. మఱియొకసారి పోయి ప్ర యత్నింపుఁ" డని మిమ్ములఁ బ్రేరేపించి, మృత్యుసమ్ముఖము నకుఁ బంపితిని. స్వామీ! ఆ నేను సంతోషాంతరంగమున మంగళధ్వానములచే దిక్కులు పిక్కటిల్ల, నగ్నిజ్వాలలంబడి ప్రాణములఁ ద్యజించి మీపాదసన్నిధిఁ జేరవచ్చుచున్నాను. ఇహలోకమున నేఁ జేయవలసిన కార్యము లింకేమియు లేవు. శత్రుహస్తగతమై శిథిలమైయుండిన మీమార్వాడరాజ్య మును పునరుద్ధరించితిని. అంతటితో నాపని పూర్తియైనది. నేఁడు సతీధర్మపాలనముఁ గావించెదను.

శా. పోరాడన్ బెరరేపి శత్రుబలమున్ బోకార్పఁబొండంచు నా
వీరస్వర్గము మీకుఁ జూపితిని; పృథ్విన్ నేను జీవించి మీ
యూరుం బేరును నిల్పి యీక్షణము విధ్యుక్తంబుగా మిమ్ము నేన్
జేరన్ వచ్చెద నాదరింపఁదగు దాసిన్ నన్నుఁ బ్రాణేశ్వరా.

[పాడుము రజియా ప్రవేశించును.]

ర—మహారాణీ! ఏమి చేయుచున్నారు?

రా—రజియా ! నేను ప్రయాణసన్నాహమందున్నాను. (ఆకసమును వ్రేలితోఁ జూపి) అస్థలమున, నాప్రాణనాథుఁడు నాకై నిరీక్షించుచున్నాఁడు. నేనాతని సమీపింపఁ బోవుచున్నాను.

ర – (ఆశ్చర్యమున) అస్థలమున, మహారాజు మీకొఱకు వేచియున్నారా ? నాకు కనబడుటలేదే ! (అని తలపైకెత్తిచూచును.)

రా—అది నాకు తప్ప మఱియెవరికిని దృగ్గోచరముకాదు.

ర—కుమారు నెవరివద్ద విడచిపోయెదరు?

రా—నీచెంత విడిచెదను. మీరందరునుండ వానికి భయమేమున్నా.

ర—ప్రపంచజ్ఞానములేని పసిబిడ్డకంటె మీభర్త యధికుఁడా ?

రా—అది మాధర్మము. మాకుఁ బతితోడిదే లోకము. అతఁడు లేకుండిన మాకీజగ మంధకారమయముగఁ దోఁచును. అతని కార్యమును నిర్వహించుటకే యింతవఱకును దేహమునఁ బ్రాణముల నిల్పుకొంటిని.

ర - మీరు పోవుటకు నేను సమ్మతింపను.

[సమర్దాన్ ప్రవేశము.]

రా—సమర్దాన్ ! కుమారుఁ డెక్కడ ?

స – లోననున్నారు. తల్లీ ! విశ్వప్రయత్నములను కావించియు, నజితసింహు నూరడింపఁజాలకపోతిని. తల్లిని నేఁ బోనీయనని పలుకుచున్నారు.

రా—వాని నిచటికిఁ దీసికొనిరమ్ము !

(సమర్దాన్ నిష్క్రమించును.)

రా—(తనలో) పరమేశ్వరా ! నిజధర్మపరిపాలనమునకై నాహృదయమును పురికొలుపుము. అజితసింహు నూరడిలఁజేయుము. నాసతీత్వమునకు భంగము వాటిల్లకుండఁ గాపాడుము.

[అజితసింహుని తోడ్కొని సమర్దాసు ప్రవేశము.]

రా—(కుమారునితో) తండ్రీ! నన్నుఁ బోనీయవా?

అ—అమ్మా! నన్నువిడచి నీ వెచటికిఁ బోయెదవు?

రా—ఎంతకాలముజీవించినప్పటికిఁ దుదకు సందఱు నెచ్చోటుఁజేరుచున్నారో, యచటికిఁ బోవుచున్నాను.

శా. ఈలోకంబున నేమియున్నదని ప్రా । ణేశుండు లేకున్నఁ బ్రా
ణాలన్ బట్టిచరింతు, భోగములపై । నాకాశయున్ జచ్చె, నిం
కేలాకామముఁ గ్రోధమున్ దనయ, నే । నీమేను పోషించి యే
లీలన్ లోకులు ఛీయనన్ విధవనై । క్లేశంబులంబొందెదన్?

అ—(కంపితస్వరమున) అమ్మా! నేనెట్లు సమ్మతింపఁగలను?

రా—లోకమునఁ దల్లులందఱును చిరకాలము జీవించియుండ లేదు. నాయనా! నన్నుఁ బోనిమ్ము.

అ—లోకమునఁ దల్లులు, కోరి, బిడ్డలను త్యజించుట లేదమ్మా!

రా—సతీధర్మ మిదియే. తండ్రీ! నన్ను నిరోధింపఁదగదు.

అ—ఇది మాతృధర్మము కానేరదు. తల్లీ! నీవట్లు నన్ను దిగనాడ నుద్దేశించుట న్యాయముకాదు. (ఏడ్చును.)

—(క్రోధముతో) సమర్దాస్! వీడు నాకొమారుఁడు కాడు. క్షత్రియుఁడుకాడు. నేను వీనికే తల్లినిగాను. సమస్తమార్వాడ దేశీయులకును తల్లినే. వీని వయస్సున నెందఱెందరో రస పుత్రికులు రణభూమిని ప్రాణత్యాగమును చేసియున్నారు. వీడొక శిశువువలె, స్త్రీవలె, నేడ్చుచున్నాఁడు. (కుమారునితో) ఛీ! మూర్ఖా! నావంశమునకు మచ్చఁదెచ్చితివిరా!

అ—(తలవంచి యూరకుండును.)

రా—సమర్దాస్! వీనిని లోనికిఁ దీసికొనిపొమ్ము!

(సమరదాసుఁ డట్లుచేయును.)

రా—ఈశ్వరా! నారీహృదయములం దమితప్రేమ నుదయింపఁజే యుట నీకు ధర్మముకాదు. ఇట్టి ధర్మకార్యాచరణముల కయ్య ది యాటంకముగ నుండును. ఇదే నేను పోవుచున్నాను. నా కొఱకును మార్వాడముకొఱకును—నాథ త్వనిమిత్తము స్వా ర్థత్యాగమొనరించిన దుర్గాదాసును భద్రముగఁ గాపాడుము

[దృశ్యాన్తరమున అగ్నికుండము నావరించి,

స్త్రీజనము నిల్చుండును.]

స్త్రీలు—సతీమణీ! నీపతికడకుఁ బొమ్ము. ఆనందకందళితహృదయ మున నగ్నికుండమున దుముకుము. పతిలేనిసతికి గతియుండ దు. ఈలోకమున నీకు సంభవించిన దుఃఖములు అన్నియు నీజ్వాలలలో నశించును. స్వర్గధామమును చేరఁగలవు.

రాణి—(ప్రజ్వలించుచున్న యగ్నిగుండమున కెదురునిల్చి)

మ. మునులు న్వేల్పులు బ్రాహ్మణోత్తములు నీ ముఖంబునన్ భోజ్యము
ల్గనుచున్నారని యెంచి శాశ్వతయశఃకాయంబు లోకంబునన్
దనరం జేసి, యశాశ్వతంబయిన యీ నామేను నీకిచ్చి పా
వనమౌ నాత్మ నొసంగుదానఁ బతికి న్స్వాహావధూవల్లభా!

(అని యగ్నికుండమున దుముకును.)

అవనిక జాఱును.



తృతీయదృశ్యము.

స్థానము—అజ్మీరునందు రాజభవనము.

[ఔరంగజేబు సింహాసనస్థుండై యుండ-దిలేర్ చెంతనిల్చుండును.]

ది—శ్రీవారి యాదేశానుసారము రసపుత్రులతో సంధిఁ గావించు కొనివచ్చితిని. ఈసంధికై సమర్థాసు నతికష్టమున సమ్మతింపఁ జేసితిని.

ఔ—అదెట్లు ?

ది—ఇది కపటము గాదనియును, చక్రవర్తిని, మీరు రీపర్యాయము విశ్వసింపవచ్చుననియు నెన్నిప్రమాణములఁ జూపినను సమర్దాసు నమ్మకుండెను. అంత నతనివద్ద నాయిరువురుకుమారులను విడచి, సంధిఁ జేసికొనఁగలిగితిని.

ఔ—సంధినియమము లెట్టివి?

ది—చిత్తూరును, తత్పరిసరప్రాంతములతో రాజపుత్రుల కొసంగవలయును. హిందువులదేవాలయము లికముందు భద్రముగ నుండవలయును. జోధపురరాజున కతనిరాజ్య మీయవలెను. రాణావారు యథాప్రకారము శ్రీవారి కవసరమువచ్చినప్పుడు సాహాయ్య మొనరించెదరు.

ఔ—రాణాజయసింహుఁ డందులకు సంపూర్ణముగ నంగీకరించెనా?

ది—అతఁ డీషరతున కియ్యకొనెనని సమర్దాసతనిని 'రాజపుత్రవంశము నీయీకార్యముచేఁ గళంకితమైనది. భీమా ! నీముఖము నవలోకించుటకు నేను లజ్జించుచున్నా' నని పలికి సభాభవనము నుండి నిర్గమించెను.

ఔ—తరువాత?

ది—ఆతరువాత మఱియొకసభ జరిగెను. ఆసభయందు సమర్దాసుఁడు "మొగలుల నెట్లు విశ్వసింపనగు" నని గర్జించుచు నుపన్యసించెను. అందులకు నేను నాపుత్రద్వయము నాస్థలమున నే యుండనిచ్చి, వారిని సమాధానపఱచి, మొగలుల కపఖ్యాతిరాకుండఁ గాపాడితిని.

ఔ—(కన్నీరుగార్చుచు) దిలేర్ ! నీవు మహాత్ముఁడవు. నీయెడల నేను కావించిన దోషములకు నన్ను క్షమింపవేడెదను. ఈ

సంధి కపటభూయిష్ఠము కాదని రాజపుత్రులను విశ్వసింపఁజేసి నందులకు నీకు ధన్యవాదము లొసంగుచున్నాను.

[శ్యామసింహుఁడు ప్రవేశించును.]

శ్యా—రాజాధిరాజులగు నౌరంగజేబు పాదుషా వారికి జయ మగుఁగాక !

ఔ—ఏమిసమాచారము, శ్యామసింహా?

శ్యా—సంధ్యనంతరము కొండొకకపటోపాయమున సమర్దాసు నంత మొందించి, మొగల్ సామ్రాజ్యమును నిష్కంటకముగఁ జేసితిని.

ది—ఏమిరా ! శ్యామసింహా ! సమర్దాసును హత్య కావించితివా ?

శ్యా—ఔను.

ది—(శ్యామసింహుని కంఠమును గట్టిగఁ బట్టుకొని) పాపపంకిలహృదయుఁడవ్వను- దేశద్రోహివగు నిన్ను నేను యమపురి కంపుచున్నాను. నీయిష్టదైవతమును ధ్యానించుకొమ్ము.

ఔ—దిలేర్! వాఁడు నీచుఁడు. వానిం జంపిన నీ కేమిలాభముండును విడువుము. విడువుము. మసిబొగ్గును కలిపి చేతులను మలినములుగఁ జేసికొనకుము.

ది—ఔను. శ్రీవారు చెప్పినట్లు కళంకమషీ లేపమున నాహస్తములు మలినభూయిష్ఠము లయ్యెను. వీనిని పవిత్రోదకమున శుభ్రపఱచి వచ్చెద. (నిష్క్రమించును.)

ఔ—దిలేర్ ! నాసమస్తసామ్రాజ్యమును వెదకిచూచినను నీవంయుత్కృష్టపురుషుఁడు లభింపఁజాలఁడు. (శ్యామసింహు నశించి) బికానీర్ మహారాజా ! సమర్దాసును చంపుడని యీఁనేను పలికియుండలేదు. నే నాతటిఘోరకృత్యముల నొ

చుట మానితిని. ఇందు మీరు స్వతంత్రించినందులకు మీకు రేపు కఠినశిక్షను విధించెదను పొండు!

(శ్యామసింహుఁడు తలవంచికొని, మెలమెల్లగ నావలకుఁ బోవును.)

[ముఆజిం ప్రవేశించి]—తండ్రీ! నాకై వర్తమాన మంపియుంటిరా?

ఔ—ఔను. మనము దాక్షిణాత్యమునకుఁ బోవలయును. సమస్తసైన్యములను భద్రపఱచుము. నీవుకూడ సంసిద్ధుఁడవై యుండుము. పొమ్ము!

(ఆజి మొకవైపును చక్రవర్తి వేఱొకవైపును పోవుదురు.)

---

## చతుర్థదృశ్యము.

స్థానము:—దాక్షిణాత్యమున పాలీగఢదుర్గము.

[దర్బారునందు మరాఠదేశాధిపతి సింహాసనాసీనుఁడై యుండును. ఎదుట దుర్గాదాసుఁడును, అక్బరును, ఆసనములయం దుందురు.]

శంభూజీ—దుర్గాదాస్! సపరివారముగ నక్బరును పాలీగఢమునకుఁ దీసికొనివచ్చుట మిగుల కష్టసాధ్యమగుకార్యము. మీసాహసమునకు నేను మిక్కిలి యాశ్చర్యము నొందితిని.

అక్బ - మేము వచ్చి చాలదినము లైనది.

శం—యువరాజా! రాజకార్యనిమగ్నుండనై స్వయముగ నేను మిమ్ముల సత్కరించలేనందుల కెంతయు దురపిల్లుచున్నాను. మిమ్ముల సత్కరించుటలో మాభృత్యు లెట్టులైన లోపముల నొనరించి యుండిన క్షమింపవేడెద.

అక్బ—రాజా! ఆతిథ్యమొసఁగుటలో మాకెట్టిలోపములును కలుగుట లేదు.

శం—మీపరివార మెచ్చట నున్నది?

దు—యువరాజుపరివారము మార్వాడరాజ్యమున సురక్షితముగ నున్నది. ఔరంగజేబువలన వారి కెట్టిభయమును లేదు. తమరు యువరాజునకుమాత్రి మాశ్రయము నిచ్చినఁ జాలును.

శం—ఈస్థల మొకలోహనిర్మితదుర్గమని భావించి, అక్బరు నిర్భయముగ నెలఁగవచ్చును. దుర్గాదాస్! మీ రితనిని చక్రవర్తులుగఁ జేసితిరని వినియున్నా నది నిజము కావచ్చునా?

దు — ఔను, మహారాజా!

శం—మంచిది. మేముకూడ నక్బరునకు 'చక్రవర్తి' నామధేయము నిడితిమి.

అ —నాసహోదరుఁడగు మ ఆజిమ్ నన్నెదుర్కొనవచ్చుచున్నాఁడు!

దు—అక్బరుపాదుషా నన్వేషించుచు వచ్చి ఆజిముసైతము ససైన్యముగ నహమదునగరమున నున్నాఁడు.

శం — భయములేదు. నేను బ్రతికియుండఁగ నెవ్వరును మనచక్రవర్తి కాపదను ఘటింపఁజాలరు. అనతికాలములో నే నతనిని బహరంపూరునకుఁ గొనిపోయి యభిషిక్తు నొనరింతును

[ఇరువురు మరాఠసైన్యాధ్యక్షుల ప్రవేశము.]

శాంతుజీ—మహారాజా! జంజిరాదుర్గపతనము సంపూర్ణమైనది.

శం —మంచిది.

కేశవ్రుఁడు—ప్రభూ! కర్నల్ కేర్, ఫెర్నాండసులు శ్రీవారి సందర్శనాభిలాషులై ద్వారముకడ నున్నారు.

శం—వెంటనే వారిఁ దోడ్కొనిరమ్ము.

(సైన్యాధ్యక్షుల ప్రస్థానము.)

శం—చూచితిరా, దుర్గాదాస్ ! ఒకక్షణమైనను విరామముండదు. పగ లాహారమ్ములేదు. రాత్రి నిదురరాదు. సంతతము కలహములు—యుద్ధములు—సంధులు—అను నిత్యమేదియో యొక

కకలహము. ఒకక్షణమైనను హాయిలేదు. దానిమాట కేమి. రసపుత్రకులు దేశమునకై ప్రాణత్యాగము నైన చేయువార ని తెలిసికొంటిని; గాని మాటిమాటికిని, వారు మొగలుల పదదళితులగుచుండుటకు కారణ మేమైయుండును?

దు —మహారాజా! ఆర్యావర్తమంతటిలో రాజస్థాన మొకరేణువు. అయిన నీమూడువందలసంవత్సరములవఱకు నది, క్షీణింపక నిలచియున్నది. రాను రాను, సైనికులసంఖ్య తఱిగిపోవుటచే నీపవిత్రభూమి కిట్టిదశ సంభవించినది.

శం—మరాఠదేశముమాత్రము మీదేశమునకుఁ దీసిపోవుననియా తలంచుచున్నారు!

దు —నేనట్లు భావించుటలేదు; కాని, రాజస్థాన మింతదనుక సస్యసంభరితమై, యోధవరుల కాకరమై, దిగంతవ్యాప్తకీర్తివంతమై యుండెనని పలుకుచున్నాను.

[కర్నల్ కేరీ, ఫెర్డినాండుల ప్రవేశము.]

శం — కేరీసాహెబ్! మీఁజంజిరాదుర్గ మెట్లున్నది?

కేరీ — (ఊరకుండును.)

శం—మాయనుజ్ఞ లేనిదే, పడవలకు మీరు హార్బరునం దాశ్రయ మొసంగితిరేని, మీ ఎలిఫెంటాలో మావారు దుర్గములను నిర్మింపప్రారంభించెదరు సుఁడీ!

కేరీ —రాజా!......

శం —ఆమాటలను మేము వినము. అవలకు పొండు! (ఫెర్డినాండు వంక తిరిగి) పోర్చుగీసుసర్దార్! మీ అంకిద్వీపము నొకపరి పరీక్షించుటకు నావలపై సైన్యముల నంపియున్నాను. మాకున్న

లోఁబడకున్నచో, మీ 'గోవా'వ్యాపారము సాగుట దుర్లభ మగును. ఇకనైన మెలకువగలిగి ప్రవర్తింపవలెను. పొండు!

(కేరీ, ఫెర్డినాండులు సలాములుచేసి పోవుదురు.)

శం—దుర్గాదాస్! నే నీయాంగ్లేయులఫిరంగిగుండ్లకుఁ జాల భయపడు వాఁడను. (సేవకు నుద్దేశించి) కాబ్లసుఖాక్!

సేవ—జీ, హుజూర్!

శం—శరాబ్ ఔర్ ఔరత్........

(సేవకుఁడు సారాయిని తెచ్చి శంతూజీ కందిచ్చును.)

శం—(గ్లాసులో సారాయినిపోసి, దుర్గాదాసున కందిచ్చుచు) స్వీక రింపుడు!

దు—క్షమింపఁగోరెదను!

శం—ఏమీ! శరాబును పానముచేయరా? ఇది నీచపదార్థమా? (ఆగ్లాసు నక్బరున కందిచ్చును.) చక్రవర్తీ! స్వీకరింపుడు!

అక్బ—సందేహ మేమియును లేదు. ఇది ప్రశస్తమైనదివలె నున్నది.

(గ్లాసు నందుకొనును.)

శం—(తానొక గ్లాసులో సారాయిని గొంతుకలో పోసికొని) అరే! ఔరత్,......

దుర్గా—మహారాజా! నేను పోయి విశ్రమించెదను. సెలవిండు.

శం—మంచిది. (దుర్గాదాసు నిష్క్రమించును.)

[వేశ్యస్త్రీలు ప్రవేశింతురు.]

శం—అనుభవము- భోగము- మొగలుజాతికే చెల్లును. ఔరత్! పాడుపాటవారు చూచి యానందింతురు. ఒకసారి నాట్యము చేయుఁడు!

అ—(సారాయిని దాఁచుచు) సురాపానము హిందువులకు నిషేధము. హే- హే-...........

శం — హాహాహ్హాహ్హా! అది వారికి నిషేధము- మనకు పరమౌషధము- రాజకార్యధురంధరులు దీనిని పానముచేసినఁ గాని శాంతిని పొందఁజాలరు. వాఁడు వట్టిమూర్ఖుఁడు; కావున నీయానందము ననుభవింపఁజాలకున్నాఁడు. ఊఁ! నాట్యము చేయుడు.

అ—అరే! నాచో! నాచో! నా......అ- అచో! (తెలివితప్పి నేలఁగూలును.)



పంచమ దృశ్యము.

స్థానము — పుణ్యమాలీదుర్గమున దుర్గాదాసుని శయనాగారము.

[పర్యంకముపైఁ గూర్చుండి దుర్గాదాసు జాబును పఠించుచుండును.]

..."ఈపరికారము, సరళహృదయుఁడును, దేశమాతృశృంఖలా విమోచనార్థబద్ధకంకణుఁడునగు భవత్సహోదరుఁడు మరణించెను. ఇహలోకమునఁ దానుచేయవలసిన కార్యము లేమియు లేకుండుటచే, మనమహారాణి, సహగమనముఁ జేసి, భర్తృసాన్నిధ్యమున కేగెను. కాపురుషుఁడును, స్త్రీసమానుఁడు నగు రాణాజయసింహుఁడు మొగలులతో నొకయవమానకరమగు సంధినొనరించి, ద్వితీయభార్యాసమేతుఁడై జయసముద్రతీరమున వసించుచున్నాఁడు. అతని యధర్మాచరణమువలనను, మహారాణి స్వర్గారోహణ మొనరించుటచేతను, సమర్దాసుని ఘోరమరణమువలనను, రాజస్థాన మరాజకముగ నున్నది. మీరు మాదోషములను క్షమించి, మ మ్ముద్ధరింపవలెను!"

[దుర్గాదా. సాజాబును చదువుచుండఁగనే, శంభూజీ ప్రవేశించును.]

శం—దుర్గాదాస్! ఈసమాచారమును వింటిరా?

దు—ఏమది?

శం—నాపరిభావము నెఱుఁగఁగోరి, నాతోఁ బోరాడవచ్చిన, యూరంగజేబును సంపూర్ణముగ నోడించితిని.

దు — నాకు సెలవొసంగినచో, రసపుత్రసైన్యములనుసైతము శ్రీ వారిసైన్యముతో నేకీభవింపఁజేసి, మొగల్‌సామ్రాజ్యమును, సమూలముగ విధ్వంసము కావించెదను.

శం — దుర్గాదాస్! మరాఠ మే యొకదినమున రాజస్థానమును, మొగల్‌సామ్రాజ్యమును కూడ గెలువఁగలదని నాయభిప్రాయము.

దు — మహారాజ్! మరాఠులును, రాజపుత్రులును హిందువు లగుటచే రసపుత్రులను గెల్చుటలో తమకు గౌరవముండదు.

శం — అది నిక్కవమేయగును. (సేవకు నుద్దేశించి) కౌన్ హైరే!

సేవ — జీ, హుజూర్!

శం — అంతయు సిద్ధముగనున్నదా?

సేవ — చిత్తము.

శం — దుర్గాదాస్! మీరు విశ్రమింపుఁడు. నేను పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

దు — (తనలో) మరాఠులు నిక్కముగ బలపరాక్రమము గలవారే యైనను, వారికి స్వాభిమానము మెండు. ఏమి వారియుద్ధనైపుణ్యము! ఏమి వారియశ్వారోహణవిద్యాకౌశల్యము! ఏమి వారి సహిష్ణుత! దీనికిఁదోడు, మాజాతికుండు స్వార్థత్యాగాది సద్గుణము లుండినయెడల, ఏ రిందునైన గెలువఁజాలుదురు. కాని, లాభము లేదు. హిందూజాతి కిఁక నౌన్నత్యము సంభవింపదు. (దూరమునుండి యార్తనాదము వినవయ్యెను.)

దు — (వినుట నభినయించి) ఆయార్తనినద మెవరిదైయుండును? ఓహో! మేఘగర్జనమువలె నున్నదే! నాద్వారము చెంతనే వినఁబడుచున్నది. ఏమి హృదయవిదారక మగు ధ్వానము! ఇది నిజముగ స్త్రీకంఠస్వరము. (ముక్తకేశయై, నిజశరీరలతి

భయముచేఁ గుంపించుచుండ, నొకయబల దుర్గాదాసునిచెం
తకు వచ్చిచేరును.)

స్త్రీ—రక్షింపుఁడు! రక్షింపుఁడు !!

దు—భయపడకుము. అమ్మా! నీ వెవరవు?

[ఆయుధపాణియై, శంభూజీయును, అతనివెనుక కాబ్లసుఖానుఁడు
ప్రవేశింతురు.]

శం—పాపీ! పిశాచీ! దానిని నీ వెందులకు పోనిచ్చితివి?

స్త్రీ—ఆమె గొప్పయింటిబిడ్డ.

శం—అయిన, దానితో నీకేమి సంబంధము కలదు?

(భయముచే నాస్త్రీ మూర్ఛిల్ల, శంభూజీ యామెను చంపఁబోయెను.
దుర్గాదాసుఁ డతని నాటంకపఱచును)

దు—మహారాజా! ఒకానొక యబలపై నిట్లత్యాచార మొనరింపఁ
బోవుట తమకు న్యాయమా?

శం—నోరు మూయుము. దూరముగఁ దొలఁగిపొమ్ము !

దు—నేఁటివఱకు దుర్గాదాసుసమక్షమున నబలల కత్యాచారము
జరిగియుండలేదు. కత్తిని యథాస్థానమం దుంచుఁడు.

శం—ఆవలకుఁ బోయెదవా, లేదా?

దు—ఎన్నటికి నట్లు చేయఁజాలను.

శం—అట్లయిన నీకరవాలమును తీసి, యుద్ధమునకు రమ్ము

దు—సురాపానజనితమదమున మీ రట్లనుచున్నారు; కాని మిమ్ము
ల నోడించుటకు తరవారు కావలయునా? (అని శంభూజీచేతి
నున్న యాయుధము నూడఁబెఱికి, నిజోత్తరీయమున నతని
కాలుసేతుల బంధించివైచి, స్త్రీని పరీక్షింప నామె మరణిం
చియుండెను.)

దు—(క్రోధకషాయితలోచనుఁడై) శంతూజీ! తులువా! పిచ్చుకపై బ్రహ్మాస్త్రము నేయ నీచేతు లెట్లాడెను? ఆహా! బాలిక నిష్కారణముగ మరణించినది. నీవా, శివాజీమహారాజుకుమారుఁడవు? ఛీ! నీముఖమునైన పరికింపరాదు.

(నిష్క్రమించును.)

శం—అరే! ఉస్కా పక్డో! పక్డో!

(మఱికొంతసేపటికి రక్తసిక్త శరీరుఁడగు దుర్గాదాసు గదిని జొచ్చును. అతని వెంట కాబ్లసుఖానుఁ డుండును. కాబ్లసుఖాన్ శంతూజీ బంధనముల విప్పును.)

దు—అందఱును సావధానులరై యుండుఁడు. ఈయేబదిమందిని మదీయకరవాలమున ఖండించి, చెండాడి, నాప్రాణముల రక్షించుకొన శక్తుఁడనైనను, నానిమిత్తము స్వజాతీయులగు హిందువులను బాధించుటకు నామనం బొప్పకుండెను. ఆస్త్రీని రక్షించుటకు నేను కావించిన ప్రయత్నము వితథమయ్యెను. ఇదిగో! నన్ను బంధించుఁడు! (చేతులఁజాచును. భయపడుచు, కాబ్లస్ దుర్గాదాసును బంధించెను.)

శం—దుర్గాదాస్! ఇపుడు నేను నిన్నేమిచేయ జాలను? జీవచ్ఛలతో నిన్నుఁ గాల్చి వేయుదునా?

కా—మహారాజా! అతిథిని మీస్వహస్తములఁ జంపు టుచితము కానేరదు. ఇతనికి పరమశత్రుఁడగు ఔరంగజేబున కితని నప్పగించిన బాగుగనుండును.

దు—సరే! అట్లే చేయనచ్చును; కాని, మరాఠదేశాధీశుఁడుకూడ, యీకాబ్లస్‌ఖానునిచేతనే మరణమొందునని యూహింపఁ జెప్పఁగలను. అతఁ డీదినమునుండి ఖాను నొకకంటఁజూడకున్న నష్టము వాటిల్లును. ఇది నాతుదియుపదేశము.

## షష్ఠదృశ్యము.

స్థానము:—అహమదునగరమున రాజప్రాసాదాంతఃపురము.

[గుల్నారుసుఖాసీనయై యుండును.]

గుల్—(స్వగతమున) నే నీదాక్షిణాత్యమునకు వచ్చుటకు కారణ మెద్దియో ప్రజ లూహింపఁజాలకున్నారు. ఔరంగజేబు, మరాఠదేశాధినాథునితోఁ గయ్యమాడి, తనపుత్రుని తీసికొని పోనుద్దేశముతో నున్నాఁడనియు, బిజాపురము, గోల్కొండల నాక్రమింప వచ్చియున్నాఁడనియు, మరాఠులను మొగల్ సైనికుల పదఘట్టనములచే రూపుమాప నున్నాఁడనియు లోకము భావించుచున్నది. అహ్హాహ్హా! లోకులు కాకులుగాక మఱేమగుదురు? కాని వీరిలో నెవ్వరును, మొగల్ సామ్రాజ్యచక్రమును త్రిప్పు వ్యక్తి గుల్నారని గుర్తెఱుంగరైరి. నే నీరథాంగము నీమరాఠదేశమువంకఁ ద్రిప్పకుండినచో, హరిహరులు సైతము పాదుషాను ససైన్యముగ నిచ్చటికిఁ గొనిరా నశక్తులై యుందురు. దుర్గాదాస్! తనకుఁ గలిగినదానితో సంతృప్తి నొందుచున్న పాదుషాను- మరాఠులను గెలువ నభిలాషలేని చక్రవర్తిని- గతఘోరసంగ్రామద్వయజనితావమానానల దగ్ధశరీరుఁడగు నౌరంగజేబును, నీకొఱకే యిచటికిఁ దీసికొని వచ్చితిని. ఆనాఁడు రాణారాజసింహునిసమక్షమున నన్ను శృంఖలాబద్ధను గావించినందులకు కోపగించి, తీవ్రదృష్టుల నీపైఁ బ్రసరింపఁజేసినందులకు నన్ను క్షమించుము! నీసౌందర్యఝంఝామారుతము మన్మనోసాగరము నల్లకల్లోల మొనరించుచున్నది. ఒక్కసారి నీముఖసందర్శన మొనరించినఁగాని మదీయహృదయవేదన ముపశమింపదు.

[ఔరంగజేబు ప్రవేశము.]

ఔరం—గుల్నార్!

గుల్నా—జహాఁపనా! బందగీ!

ఔరం—(చిఱునగవుతో) దుర్గాదాసు పట్టుబడినాడుసుమీ.

గుల్నా—ఇది పరిహాసములకు సమయముకాదు. ఉన్న దున్నట్లు వచింపుఁడు.

ఔరం—ప్రేయసీ! పరిహాసముకాదు. కాబ్లసుఖానుఁ డతనిని పట్టుకొనెను. వానికి నే నేఁబదివేలరూప్యములు బహుమానముగ నిచ్చితిని. మరాఠరాజునుకూడ నిట్లె బాధించినచో దానికి పదిరెట్లు పారితోషిక మిచ్చెదనని పలికితిని.

గుల్నా—ఇపుడు దుర్గాదాసు నేమిచేయఁదలఁచినారు? అతఁ డెక్కడ నున్నాడు?

ఔరం—దిలేర్‌ఖాను రక్షణమున నున్నాడు. అతనికిఁ దగిన దండనము విధింప నుద్దేశించియున్నాను.

గుల్నా—వలదు. మీస్వహస్తముల నతని బంధనములను విప్పఁ యుఁడు.

ఔరం—ఏమీ! గుల్నార్! నీవస్వస్థమనస్కవైయున్నావు. ఈసమయమున నీతో సంభాషింపఁదగదు.

(ఆవలకుఁ బోవును.)

గుల్నా—మంచిది. దుర్గాదాస్! నాస్వహస్తముల నిన్ను బాంధవవిముక్తుని గావించెదను. నిన్ను మొగల్‌సామ్రాజ్యసింహాసనముపై నధివసింపఁజేతును. నేను నీసామ్రాజ్ఞి నయ్యెదను. అదియె నాలక్ష్యము. తత్కార్యనిర్వహణమునకే నేను జీవించియున్నాను. నాజీవితచరిత్రమున నిదియొక్కటే నాకు శుభదినము.

దృశ్యాంతరము.

[మొగల్ శిబిరమందలి కారాగారము- శృంఖలాబద్ధుఁడగు దుర్గాదాసటుఁనిటు భ్రమించుచుండును. సమయము నిశీధము.]

దుర్గా—(ఆత్మగతమున) భళిరా! విపరీతకాలము సమీపించినది.

గీ. చండబాహుదండాఖండ। మండలాగ్ర
ఖండితారాతివీరప్ర। కాండ కాండ
మాంసఖండసంప్రీతగో। మాయుచయుఁడు
పురుషసింహుండు కపటవా। గురకుఁ జిక్క-
నధమవిధికి నసాధ్యకా। ర్యంబు గలదె.

మరాఠదేశపాలకా! కుటిలనీతిని రాజ్యపరిపాలన మొనరించువై దేశిక రాజన్య మృగములఁ జెండాడిన యీదుర్గాదాసనెడు వీరసింహుండు, నేఁడు, స్వజాతీయుఁడవగు నీచే బోనులో బాధింపఁబడెఁగదా! మీకు, మొగల్ రసపుత్రజాతులపై విజయమొందు సమయము వచ్చునని స్వప్నమందైన భావింపకుము. ఒకప్పుడీరసపుత్ర- మరాఠ- మొగల్ జాతులను మూఁడింటిని వేఱొకజాతి విధ్వంసము కావించుట కవకాశము కలదు. అప్పుడుగాని విశ్వాసఘాతుకత్వమునకు వినాశకాలము చేకురదు. (కొంచెమాగి) ఎవరో కవాటమును తెఱచుచున్నారు? ఎవరది?

[స్వాలంకృతయై గుల్నారు ప్రవేశించును.]

దు—ఓహో! ఓహో! ఎవరీసౌందర్యరాశి! తమ రెవరమ్మా?

గు—(నవ్వుచు) బేగము గుల్నారుచు.

దు—బేగం గుల్నారా?

గు—ఔను. ఒకప్పుడు మీరు నన్నుఁ గారాగారమందు బంధించియుంటిరి. ఇపుడు మీరు నాఖైదీలుగా నున్నారు.

దు.— తమరు నన్ను శిక్షించుటకు వచ్చినారా?
గు.— మిమ్ముల విముక్తులఁ జేయుటకు వచ్చితిని.
దు.—అట్లైన నాకుఁ బ్రత్యుపకార మొనరింప నేతెంచితిరి కాఁబోలు.
గు.— కాదు.
దు.—చక్రవర్తి యాదేశముపై వచ్చితిరా?
గు.—నేటివఱకు కతఁడే నాయాజ్ఞానుసారియై ప్రవర్తించుచుండ, నీ గుల్నారతనికి లోఁబడియున్నదనుట మీ అమాయికత్వము.
దు. అయిన తమ రిచ్చోటికి భయంకర గాఢ నిశీధ సమయమున నేతెంచుటకు గారణ ముండవలెఁగదా.
గు.— నాప్రాణేశ్వరులగు మీ బంధనముల విమోచనము కావింప వచ్చినాను.
దు.—(ఆశ్చర్యమున) ఇది యేమిపరిహాసము?
గు.—మొగల్ సామ్రాజ్ఞియగు గుల్నారొకసాధారణసేనానాయకుని "ప్రాణేశ్వరుఁడా" యని సంబోధించుటఁజూడ, మీ కాశ్చర్యము జనింపవచ్చును; కాని, నేఁ డీరాజ్ఞి సాధారణస్త్రీవలె బ్రవర్తించుట కొకకారణ మున్నది. ఈమె మిమ్ముల "ప్రాణేశ్వరా!" యనిపిలచుటలో నత్యంతానందమును బొందుచున్నది.
దు.—కాని, సామ్రాజ్ఞి ! ... ... ...
గు.—(వినినట్లు నటించి) దుర్గాదాస్! నేఁటిదనుక గుల్నారు మానవమాత్రునివలలోఁ దగుల్కొనియుండలేదు. ఈసామ్రాజ్య వ్యవహారములందు పాదుషాహస్తాక్షరములు తప్ప మరేమియును మీకుఁ గానరావు; కాని, పరిపాలనాభారమంతయు గుల్నారుపైనున్నది. సమస్తచరాచరజంతుజాలము గుల్నారి నామమును స్మరింపని దినము లేదు. గుల్నారు హర్షచిత్తయై యున్నపుడు లెక్కకులేని నూతనరాజ్యములు స్థాపింపఁ

చున్నవి. ఆమె భ్రూభంగ మొనరించినచో రాజాధిరాజులు నశించుచున్నారు. ఏతాదృశప్రభావముంగలిగిన యీ బేగం గుల్నారు నేఁడు మిమ్ములను ప్రేమించి, మీ ప్రేమపాశముచే బంధితురాలై, మీ ప్రేమయనెడు శీతలవర్షబిందువుల స్నానమాడి, మీవక్షస్థలమున నిద్రాసౌఖ్యమును పొందఁగోరి వచ్చియున్నది.

దు—(ద్విగుణీకృతాశ్చర్యమున) గుల్నార్! మీమాటల కర్థము నా కవగాహ మగుట లేదు.

గుల్నా—మీరు చక్రవర్తికి భయపడవలసిన పనిలేదు. అతఁడు నా దాసుఁడు. రండు! సింహాసనమున మిమ్ములఁ గూర్చుండఁ బెట్టెదను. రండు.

దు—సామ్రాజ్ఞీ! భుజపరాక్రమమున గెలిచివని సింహాసనము నా కవసరములేదు.

గు—మీకు సామ్రాజ్యాభిలాష లేదా?

దు—లేదు. తమ స్థలమునుండి మరలిపొండు!

గు—ఏమీ? మీరు నన్నుసైతము పొమ్మనుచున్నారా? నన్నుఁ బ్రేమించుటకు మీ కిష్టములేదా?

దు—పరదారాపరిగ్రహణము మారాజపుత్రులకుఁ దగనిపని. ఆ యధర్మమునకు నే నిదివఱకు నొడిగట్టుకొనలేదు.

గు—ఔరంగజేబువంటి చక్రవర్తులు, ఏయబలవాగనుశాసనమున నధీనులై యున్నారో, యట్టినాప్రేమను నిరాకరించుచున్నారా?

దు—సామ్రాజ్ఞీ! లోకమున నౌరంగజేబులును, దుర్గాదాసులును గలరు. కేవల మౌరంగజేబులతో ప్రపంచము నిండియుండ లేదు.

గు— మీకాఠిన్యమువలన మీకెట్టియాపద సంభవించునో, తెలిసి కొంటిరా?

దు—ఆహా! తెలిసికొంటిని. మృత్యువునకు నేను భయపడను. మృత్యువుకంటె భయదాయకమగు నాపద లేనేలేదు. ఈతకు మించిన లోతును, చావునకుమించిన హానియు లేదుగదా.

గు—దుర్గాదాస్! మీరు నాతోఁ బరిహాసము లాడుచున్నారు.

దు—అట్లుకాదు. నేటివఱకు నే నీవిధములగు పరుషవాక్యముల-గంభీరశబ్దములఁ బలికియుండలేదు.

గు—(రోషకషాయిత లోచనవై) నన్నుఁ బ్రేమింతువా, లేక మృత్యుదేవతాసాన్నిధ్యమును గోరుదువా ?

దు—మృత్యువునకు సిద్ధపడియే వచ్చితిని.

గు—(కుమారు నుద్దేశించి] కామబఖ్షా!

[కామబఖ్షా ప్రవేశము]

కా—మా! క్యాహుకుం?

గు—(దుర్గాదాసును వానికి చూపుచు) వీనిని వెంటనే వధింపవలెను.

[కామబఖ్షా తరవారు నొఱనుండితీసి దుర్గాదాసును నఱకఁబోవును దిలేర్ ఖానుఁడు శరవేగమున నచటికి వచ్చును.]

దిలేర్—(కామబఖ్షాకు పిస్తోలునుకనపరచి) సావధానుఁడవై మెలఁగుము. లేకున్న నిన్నీపిస్తోలున, నరకమున కంపెదను.

గుల్నా.—దిలేర్! ఇందు నీవెందులకు జోక్యము కలిగించుకొనుచున్నావు? నీకుఁగల యధికార మేమి?

దిలేర్—పాపాత్మురాలా! నోరుమూయుము! నే నీశ్వరునకుఁదప్ప తదితరులకు భయపడను. (దుర్గాదాసు నవలోకించి) మహాత్మా! లోకమున కాదర్శప్రాయుఁడవగు నీకు నాప్రాణము లడ్డు. (అతని బంధనముల విప్పి) ఆవల నొకయశ్వము నుంచినాడను. దాని నధిరోహించి యథేచ్ఛం జనుఁడు.

(దుర్గాదాసు నిష్క్రమించును. అతని వెంట దిలేర్ ఖానుఁడుఁబోవును.)



శ్రీ

# దుర్గాదాస్.

## పంచమాంకము.



### ప్రథమదృశ్యము.

[సింహాసనారూఢుండై అక్బరు వెలయాండ్రినృత్యమును చూచుచుండును.]

అ—నాచో, ఖూబ్ నాచో! ఔర్ నాచో! వహవ్వా! బహుత్ అచ్ఛాహై. (ఆడుము బాగుగ నృత్యముచేయుము. చాల బాగుగానున్నది.)

[కాబ్లసుఖాన్ ప్రవేశము]

అ—కాబ్లస్! శంభూజీ కహా! (శంభూజీ యెచ్చట?)

కా—(నేల పడిపోవుటను నటించి) మర్‌గయా, షాజాదా! (యువరాజా! చనిపోయెను.)

అ—ఏమీ! నీవు సత్యమును పలుకుచున్నావా?

కా—ఔను నిక్కమునే వచించుచున్నాను. శంభూజీమహారాజ్, కారాగారమం దున్నాఁడు. ఇపుడు మీ రేమి చేయఁదలఁచుకొన్నారు? పాదుషావారిచేఁ జిక్కి కారాగృహమందున్న మీ మిత్రునిఁజూడ నభిలాష యున్నయెడల, నాతో మీతండ్రి కడకు రండు.

అ—(వికటముగ నవ్వుచు) అతనిసమీపించుటకంటె వ్యాఘ్రమున కెఱయగుట మేలు.

కా—యువరాజా! నాతో నేగుదెంచిన మీ కీర్తిభయమును చేకూరదు. నాప్రాణముల నొసంగియైనను మిమ్ములఁ గాపాడెదను, రండు!

[దుర్గాదాసు ప్రవేశించును.]

దు—(కాబ్లసు నుద్దేశించి) విశ్వాసఘాతుక! నీమాయావాగుర నక్బరునుసైతము బడద్రోయ నెంచితివా ?

కా—(కంపితశరీరుఁడగుచు దుర్గాదాసు నవలోకించుచుండును.)

దు—కాబ్లస్! నీమనోరథ మీడేరినది కాదని, యాలోచించుచున్నావా? నాముఖమునంక నంతతీవ్రముగఁ బరికించుచున్నావేల? నీకేమియుఁగాని నేను మరణించినను నష్టములేదు; కాని, నీ ప్రభువును—శంభూజీనిసైతము ఔరంగజేబున కప్పగించుటకు నీకు చేతు లెట్లువచ్చెను?

కా—(శరీరము కంపింప) నేను—కా...ఆ...

దు—(పండ్లఁగొఱుకుచు) నీచా! ఆపనిచేసినది నీవుకాదా? నీ ప్రేరేపణమున శంభూజీ యొక్క బ్రాహ్మణస్త్రీని గవయుటకు, దుర్గమునుండి నిర్గమించుట సత్యమా, యసత్యమా?

కా—నిజమే.

దు—అతఁడట్లు దుర్గప్రధానద్వారముదాఁటి బయటకువచ్చుటయుతడవుగ, సైన్యయుతుఁడై యచ్చోట వేచియుండిన, ఆజిమతనిని పట్టి బంధించుట నిజమా, కాదనెదవా? అనృతమాడినచో నీ కిప్పుడే తగినశిక్షను విధింతును.

కా—(పాఱిపోవుటకుఁ బ్రయత్నించును.)

దు—భాగోమత్! (పాఱిపోవద్దు!) జాగ్రత!

[అనిపలుకుచు దుర్గాదాసు వానిమెడను బట్టును]

దు—అల్లాను స్మరింపుము. మూర్ఖా!

కా—మాఫ్‌కరో! మాఫ్‌కరో! ఖుదాబంద్! (క్షమించుడు. క్షమించుడు. అని దుర్గాదాసు చరణముల వ్రాలును.)

దు—పాపా! నిన్నువధించి నావంశమునకుఁ గళంక మాపాదింపను. నీవు శంభూజీనాశనమునకు మూలకారణమవు. నీకు నరకమునసైన దావుండదు. అవలకుఁబొమ్ము! (కాలితోఁదన్ని కాళ్లను నావలకుఁ బడవేయును.)

దు—(అక్బరునుద్దేశించి) షాజాదా! సురపానమే నీసర్వనాశమునకుఁ గారణభూతమగునని, నేనొకనాడు శంభూజీతోఁ బలికియుంటిని. మీరద్దాని నిపుడు ప్రత్యక్షముగఁ గాంచియున్నారు. ఇఁకనైన మేల్కాంచి మీరా దురభ్యాసమును వీడకున్నచో, మీకును శంభూజీగతియె పట్టును.

అక్బ—రాఠొరుసేనాధ్యక్షా! ఇంతకాలమైనపిదప, మఱిలాభమేమి కలదు?

దు—అట్లనఁబోకుడు. ధైర్యము నవలంబించి, చిత్తము నావంక పరువిడకుండ బాధింపఁ బ్రయత్నింతురేని మీకు ముక్తి కలదు. తప్పక విజయముఁ బొందఁగలరు.

అక్బ—(కొంతసేపూరకుండి) దుర్గాదాస్! మీరు సత్యమువక్కాణించితిరి. ఈదురభ్యాసజనితాంతరంగికదురవస్థ నామస్తకమును పాడుచేసినది నాజీవితముపై నాకే యసహ్యము పుట్టుచున్నది. ఇఁక నే నీప్రపంచముతో సాంగత్యము వీడెదను వీడెదను. వీడెదను.

దు—అట్లుకాదు. మీరు నాతో మార్వాడమునకు రండు. మీ ఖిందును భయమ్ములేదు.

అక్బ—మార్వాడమునకుఁ గాదు. మక్కాకుఁ బోయెదను. నానిమిత్తము మీరు పడరానిపాట్లను బడియున్నారు. మిమ్ములఁ గష్టపరంపరలలో ముంచినందులకు నన్ను క్షమింపుము. నన్ను నిర్బంధించవలదు.

దు—ఇందు క్షమించుట కేమున్నది? అది నా కర్తవ్యము.

అక్బ—దుర్గాదాస్! నేను మక్కాకుఁబోయి, అట్టికర్తవ్యము నే నేర్చుకొనెదను. అనేకకిల్బిషముల నాచరించితిని. భోగవిలాసములఁ గాలక్షేప మొనరించితిని. తండ్రికి శత్రువుఁడనైతిని. నాభార్య మరణమునకుఁ గారణుఁడ నైతిని. నన్ను రక్షింపవచ్చిన మిమ్ముల నాపత్పరంపరల ముంచితిని— ఈపాపపరిహారార్థము నేను భగవంతుని వేడుకొనవలయును. మీరు నాకొఱకొక్క కార్యమును చేయవలసియున్నది. మీదేశమున కేగి నా "రజియా" నుమాత్రము భద్రముగఁ గాపాడుము. నేను పోవుచున్నాను.

(అవనిక జారును)



## ద్వితీయదృశ్యము.

[కోయలూగుదుర్గశిఖరమున, శీతలచంద్రచంద్రికలఁ జూచుచు,
రజియా-మార్వాడయువరాజగు నజితసింహుఁడు,
కూర్చుండి యుందురు.]

శ—అజిత్! ఆచంద్రుఁ డెంతమనోహరముగనున్నాఁడో చూడుము! ఆనల్లని మేఘములను భేదించుకొనుచు నుదయించుచున్నాఁడు. వినీలకుంతలసన్నిభకాలమేఘములపై జిగజిగ మెఱయు నగవలెఁ గన్పట్టుచున్నాఁడు. అదిగో, చూడుము! ఇపు డాబింబ

బము జలధరాచ్ఛాదితమై, కేవల మొకరేఖవలె కనఁబడుచు న్నది. ఆహా! ఆకస మెంతరమ్యముగ నున్నది!

అజి — నేనాదృశ్యము నాలోకించుచుండలేదు. నీసుందరవదనారవింద మును తిలకించుచున్నాను.

ర—అజిత్! నీమాటల నాలకించుచున్న నాయాశ్చర్యమునకు మేర యేలేదు. ఈ ధరాతలమున దర్శనీయములగు వస్తువు లనేక ములుండ, నాముఖమువంకనే గమనింపుచుంటివా?

అజిత్ — వానికంటె నీమొగమే మిక్కిలియందముగ నున్నది.

ర—అజిత్! నీ వత్యంత బాలుఁడవు. కాకున్నచో నాయంబుదావృత సుందరచంద్రబింబముకంటె నాముఖమే యందముగ నున్న దనుటకు నీవు లజ్జించియుందువు. సముద్రమున జనించి, తద్వేలావిలీనములగుచున్న కెరటములకంటె నావదనము ది వ్యముగనున్నదని వచించుటకు సిగ్గుపడియుందువు. రాజకు మారా! సుందరవస్తుమయమగు నీప్రకృతిదేవిని నీవు బా గుగఁ దిలకించినచో, నీరీతిఁ బలికియుండవు.

అజి—రజియా! నేనిఁక బాలకుఁడను కాను. ఈభూతలమునఁ గల సుందరవస్తుజాలములలో స్త్రీ ముఖ్యమైనది- నారీజనముల కెల్ల నీవు సౌందర్యవతివి.

ర—ఆమాటను నేను విశ్వసింపను.

అజి—అట్లైన నామీఁద నీకు ప్రేమలేదన్నమాట.

ర—ఏమీ! ప్రేమించుట లేదనియా, పలుకుచున్నావు? నీవులేక నాజీవితము శూన్యము. నీనామోచ్చారణమున నా కానంద ము. నీపై నాకత్యంతమోహము.

అజి— నిక్కముగ నన్నుఁ బ్రేమించుచున్నావా?

ర—నే నన్నుతము లాడనేరను.

అజిత్—ప్రాణేశ్వరీ! (అని సంబోధించి, రజియాహస్తమును పట్టు కొనును.)

ర—ప్రాణనాయకా!

(అని యతని నాలింగనముచేసికొను సమయమున ముకుంద దాసనునాతఁడు ప్రవేశించును. తత్క్షణము అజితుఁడు కౌఁగిలి విడును.)

అ—ముకుందా! ఏలవచ్చితివి? వింత లేమైనఁ గలవా?

ము—చిత్తము. దుర్గాదాసు దాక్షిణాత్యమునుండి వచ్చియున్నాఁడు.

అ—(ఆశ్చర్యముతో) ఏమీ! దుర్గాదాసు వచ్చియున్నాఁడా? అత నిని తత్క్షణము లోనికిఁ దోడ్తెమ్ము!

ము—చిత్తము. (నిర్గమించును.)

అ—రజియా! నీవు గృహాభ్యంతరమునకుఁ బొమ్ము!

(రజియా నిష్క్రమించును)

అ—నాప్రాణదాతయగు- నాతండ్రికి విశ్వాసపాత్రుఁడగు—దేశ మాతకు ముద్దులపట్టియగు, దుర్గాదాసు వచ్చియున్నాఁడను వార్త కర్ణపుటములంబడఁగానే, నా కొకవిధమగు నసూయ జనించుచున్నది. (కొంతవఱకు నాలోచించి) ఛీ! నాదురూ హాలను పారద్రోలి యతనియెడల నాకును- నాపూర్వుల కుండు గౌరవము నిపుడు చూపించెద.

[ముకుందదాసు, శివసింహుఁడు, వెంటరా దుర్గాదాసు ప్రవేశించును.]

దు—మహారాజ్! భృత్యుఁడు తిరిగి స్వరాజ్యమును చేరుకొనినాఁడు. చాలదినముల కీమందభాగ్యునకు, కొమ్ముల "మహారా"జని

పిలచుట కవకాశము చిక్కినందులకు భగవంతుని కొనియాడుచున్నాను. ఇవిగో నావందనసహస్రములు.

(సాష్టాంగపడును.)

అ—సేనాపతీ! క్షేమమా?

దు—చిత్తము కుశలముగనే యున్నాను. యుద్ధవార్త లేమైనఁ గలవా?

ముకుం—సేనానాయకా! ఔరంగజేబు 'మహమ్మదుషా' యనువానిని, యశ్వంతసింహుని పుత్రుఁడని, లోకుల మోసపుచ్చి, వానిని జోధపూర్ సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. స్వయముగ మహారాజావారు, చక్రవర్తితో యుద్ధ మొనరించి, వాని నోడించినారు. ఆ మహమ్మదుషా కొన్నాళ్ళకు చనిపోయినాడు.

అ—దుర్గాదాస్! జయసింహుని తనయుఁడగు నమరసింహుఁడుతండ్రితో శత్రుత్వమూని, యుద్ధము చేయనున్నాఁడు. జయసింహుఁడు మాసాహాయ్యము నపేక్షించియున్నవాఁడు; కావున మీరందఱు యుద్ధసన్నద్ధులై యుండుడు!

దు—చిత్తము. కాసి మెక్కడ?

అ—లోననున్నాడు. అతని శరీరావస్థ మునుపటివలె లేదు.

దు—అతని నొకసారి చూడ సెలవిండు! (వందనమిడును.)

(ముకుందశివులతో దుర్గాదాసు లోని కేగును.)

## తృతీయదృశ్యము.

స్థానము:— దాక్షిణాత్యమున మొగల్ శిబిరము.

[ఔరంగజేబును దిలేర్ ఖానుఁడును సంభాషించుకొనుచుందురు.]

ఔ—దిలేర్! అక్బరు సర్వసంగపరిత్యాగముఁ జేసి మక్కాకుఁ జోయినాడా! ఆహా! వానిమేలుకొఱకే నే నిన్నికష్టములఁ బఱ

వలసివచ్చినది; కాని ఫలములేదు. నేనుకూడ మక్కాకుఁ బోయి భగవచ్చింతనమందు కాలయాపనము చేసెదను. కాని, దిలేర్! నీ విం కొక ముఖ్యకార్యమును చేయవలసియున్నది రజియానుద్ధరించుభారము నీపైనుంచితిని. ఆనాఁడు నీవు దుర్గాదాసును విడువకున్నచో నాకార్య మాక్షణముననే సాధించియుందును.

ది—ఎట్లు సాధించియుందురు? ఆవీరుని భయపెట్టియా? అది యెన్నటికిని సంభవము కానేరదు. ఆయుధపాణియై, తనప్రాణములఁ గొనిపోవ్రటకై వచ్చిన యమదూతవలె, సమ్ముఖమున నిల్చియున్న కామబఖ్షానుకతఁ డిసుమంతయైన జంకక, నొకయచలమువలె నుండెను. అట్టివానిని భయపెట్టి మీరు రజియానుద్ధరించుటయా? కేవల మది ప్రగల్భము.

ఔరం—ఔను, సేనానాయకా! దుర్గాదాసుఁ డుదారపురుషుఁడు. కాని—

దిలేర్—కర్తవ్యముకొఱకు రాజపుత్రులు జీవములనైతము బలిదాన మొసంగెదరు. దుర్గాదాసుఁడు వారందఱకు నతీతుఁడు.

ఔరం—సత్యము. అయిన నీకె రజియాను రసపుత్రుల హస్తములనుండి విడిపించుట దుర్లభమగునందువా?

దిలేర్—శ్రీవారు నాకు సర్వాధికారము నిచ్చినచో నామెను విడిపించుటకుఁ బ్రయత్నింతును.

ఔరం—ఉపాయము ?

దిలేర్—క్రమక్రమముగఁ దమకుఁ దెలియఁగలదు.

[కాబ్లసుఖానుఁడు ప్రవేశించును.]

ఔరం—కాబ్లస్‌ఖాన్! ఏమి సమాచారము?

కాబ్లు—ఖుదాబంద్! శంభూజీని గార్దభముపై నెక్కించి, పట్టణముం తటను త్రిప్పి తుదకు వధ్యస్థానమునకుఁ దీసికొనిపోతిని. అతనినిచంపుట కేరును సాహసింపమిఁ, దిరుగ నిచ్చోటికిఁ గొనివచ్చితిని.

ఔ—అతని నిచ్చటికిఁ దీసికొనిరమ్ము!

కా—నాబహుమానముమాట మఱచినారా?

ఔ—అతనిని తీసికొనివచ్చినపిదప నీకు బహుమతి నిత్తును.

(సలాంచేసి కాబ్లస్ నిష్క్రమించును.)

ఔ—దిలేర్! నాజీవితముపై నాకే యసహ్యము జనించుచున్నది. అక్బరును విద్రోహిగఁ జేసికొంటిని. ముఅజిముతో శత్రుత్వముఁ బూనితిని...............

[ఆజింకాబ్లసులు శంభూజీని తీసికొనివత్తురు.]

ఔ—(శంభూజీని చూచి) శంభూజీమహారాజ్! మామసీదుల నపవిత్రములఁ గావించి, మా మౌల్వీలను బాధించి, మాపురాణమును నిందించుటకుఁగాను, నీకుఁ దగినశిక్షను విధింపవలదా?

కా— జహాఁపనా! ఖురానును, నిందించినందులకు నే నీతని నాలుకను గోసితిని.

ఔ— శంభూజీ! ఇప్పుడైనను మాఖురానును స్వీకరించినచో, నీకు ప్రాణదాన మొసంగెదను.

[శంభూజీ మారుపలుకక పండ్లుకొఱుకును]

ఔ—వీడు మహాగర్వివలె నున్నాడు. తత్క్షణము వీనిని వధించి, వాని శిరస్సును నాకొసంగుడు.

(శంభూజీని వెంటనిడికొని, కాబ్లసును, ఆజిమును నిష్క్రమింత్రు

ఔ—దిలేర్ ! ఇస్లామమతమును ప్రచారముచేయుటకే నేను నా తండ్రిని కారాగారబద్ధుని కావించితిని. అన్నదమ్ముల ప్రాణములఁ దీసితిని.

దిలేర్—జహాఁపనా ! ఇప్పుడైనను, మీదుష్కృతముల మాని, మందిరములందును, మసీదులందును 'అల్లా' 'పరమేశ్వర' నామముల నినాదములు దిగంతములఁ బ్రతిధ్వనింపనీయకున్నచో, ముసల్మానులు హిందువులపై ద్వేషమును వీడకున్నచో, నార్యావర్త మరాజకమై పోవును. మీరు పేరు ప్రఖ్యాతియు లేక నశింతురు.

ఔ—(చిఱునవ్వు నవ్వి) దిలేర్ ! హిందూముసల్మానుజాతుల కేకతాభావము కుదురదు. నీవు కలఁగాంచుచున్నావు.

దిలేర్—ఆకలకుఁ గూడ మీరు విఘ్నము కూర్చినారు.

[కాబ్లస్‌ఖాన్ ప్రవేశించి, చక్రవర్తికి శంభూజీ శిరస్సును సమర్పింపఁబోవును.]

ఔ—అరే ! హటావ్ ! హటావో ! (ఆతలను నాముందఱనుండి తొలగించుము.)

దిలేర్—చక్రవర్తీ ! మీసహోదరుల రక్తధారలచే సంప్రాప్తించిన యీరాజ్యము, నేఁడీశంభూజీవీరుని రుధిరప్రవాహముతో నంతమొందినది.

(అని యచటినుండి పోవును.)

కాబ్లస్— ప్రభూ ! నాబహుమానము నొసంగి నన్ను పంపివేయుఁడు.

ఔ—నిమక్‌హరాం ! నీకు బహుమానము కావలయునా ? చలో ! బాహర్ జావో, కుత్తా ! (కాలితోఁదన్నును.)

## చతుర్థదృశ్యము.

స్థానము:—జోధపురరాజప్రాసాదము.

[అజితసింహ శ్యామసింహులు సంభాషించుచుందురు.]

శ్యామ — శ్రీవారు రుదయపురరాణావారి సహోదరపుత్రికను వివాహమాడినారని విని చాల సంతోషించుచున్నాను. నేడు కదా, మీవారు మార్వాడరాజ్యముల యైకమత్యము కలిగినది !

అజిత్—ఈసంబంధము దుర్గాదాసు చేసినదే.

[దుర్గాదాసు ప్రవేశించును.]

శ్యామ—దుర్గాదాస్ ! రజియా యెచ్చటనున్నది?

దుర్గా—ఆమెను సుజాయత్ ఖానుతో ఢిల్లీకి పంపివేసినాను.

శ్యామ—ఏమీ ! నే నామెను భద్రముగఁ గొనిపోయియుందునే. నన్నేల విశ్వసింపకున్నారు ?

దుర్గా—నీవు గబ్బిలమువంటివాఁడవు. విశ్వసనీయుఁడవు కావు; కను కనే యాతనితోఁ బంపితిని.

అజి — ఏమీ ! సేనాపతీ ! రాజునగు నాయనుజ్ఞ లేనిదే నాప్రాణప్రియను- రజియాను- మొగలుల కప్పగించుటకు నీ కెట్టి యధికారము కలదు ?

దుర్గా — అక్బరు సపరివారముగ నన్నాశ్రయించెను; కావున నాకట్టి యధికారము కలిగినది. రజియాను మీరు ప్రేమించుచున్నారని నాకు బాగుగఁ దెలియును; కాని మీ రామెను మోహించుటలో గొప్ప ముప్పు కలదు. నేను బాగుగ నాలోచించియే రజియాను ఢిల్లీకిఁ బనిచితిని.

అజి—(కోపముతో) దుర్గాదాస్ ! ఈక్షణమునుండి నీవు మార్వాడ

మును విడిచిపోవలయును. నాజీవితమున ని న్నీరాజ్యమునఁ గాంచినంత నె......... ........

దు—చిత్తము. (అని సలాంచేసి నిష్క్రమించును.)

అజి—శ్యామసింహా! ఈకుట్రయందు నీవుకూడ నున్నావనుకొనెదను. నీవుకూడ నిచటినుండి తొలఁగిపొమ్ము!

(శ్యామసింహుఁడు నిర్గమించును.)

అజి—(తనలో) రజియా! మనప్రేమబంధము దైవవశమున నిట్లు తెగిపోయినందులకు దురపిల్లుచున్నాను. దైవము నిన్నును నీవలన దుర్గాదాసును సైత మెత్తుకొనిపోయెను. ఇఁక నే నామరణాంతము మిూకై వగచుచు, దుఃఖాబ్ధిని మునుఁగుచుండవలసినదే.

[కాసిం ప్రవేశించును.]

కాసిం—అజిత్! దుర్గాదాసుగా రేమిచేయుచున్నారు?

అజిత్—రాజ్యపరిత్యాగముఁ జేసి పోయినాడు.

కాసిం—అతఁడు నిజేచ్ఛను రాజ్యమును పరిత్యజించెనా?

అ—లేదు. కొండొకకార్యమున నతఁడు స్వతంత్రించి పనిచేసినందులకు నే నాతని వెడలఁగొట్టించితిని.

కా—అతఁడు స్వతంత్రించెనా? ఎన్నటికి నట్లు చేయఁడు. దుర్గాదాసు స్వతంత్రించినచో నిజపదాఘాతమున నీవంటిరాజుల ననేకులను నేలఁగూల్చి, రాజాధిరాజు కాఁగలిగియుండును. నీవు విశ్వాసఘాతుకుఁడవు. మూర్ఖుఁడవు. నీముఖమును చూచినఁ బాపము వాటిల్లును.

(అని త్వరితగతిని వెడలిపోవును).



పంచమదృశ్యము.

స్థానము—ఔరంగజేబునందు రాజప్రాసాదాంతఃపురము.

[గుల్నార్ సుఖాసీనయై, ఎదుటనున్న యద్దమునందలి నిజప్రతిబింబము నవలోకించుచుండును.]

గుల్—(అద్దమందలి తనరూపమునుచూచి) ఆహా! నారూప మెంతలో మాఱిపోయినది? నేను మునుపటి గుల్నారును కాను. ఎత్తుగానుండిన నాచెక్కిళ్ళు చిక్కిపోయినవి. ముఖమున వివర్ణమావరించినది. నాకోమలబాహులతలు వాడిపోయిన చంపకమాలికలను బోలియున్నవి. ఆహా! నాతొల్లింటిరూప మెంతలో మాఱిపోయినది! దీనితోపాటు నాయధికారము కూడ నశించినది. నాకుమారుని బిజాపురమునకుఁ బంపవలదని నివారించినను, వినక, ఔరంగజేబు తనకోర్కెఁ జెల్లించుకొనెను. ఒకసారి మాటలాడిపోమ్మని వర్తమానమంప, "సమయములే" దని ప్రత్యుత్తర మిడెను. ఇప్పుడు నాయధికార మెంతసన్నగిల్లినది! ఏనాఁడు దుర్గాదాసు నాప్రేమను నిరాకరించెనో, ఆనాఁటినుండియు నా కీహీనదశ సంప్రాప్తమైనది.

[రజియా ప్రవేశించును]

గు—రజియా! నేను మునుపటివలె నున్నానా? లేక నారూపమం దెట్టిమార్పయినఁ గలదా?

ర—అమ్మీజాన్! నీవు మునుపటివలె నున్నావో, యిప్పటివలె నున్నావో నేను చెప్పఁజాలకపోయినను, నావలెనే విరహవేదనావస్థయం దున్నావనిమాత్రము చెప్పఁగలను.

గు—ఏమీ! నీవుసైత మొకకఠినహృదయునిఁ బ్రేమించి, నిరాకరింపఁబడితివా?

[దాసి ప్రవేశము]

దాసి—షాజాదీ ! భీతర్ చలో! (యువరాజ్ఞి! లోపలకుఁ బొమ్ము!)

గుల్నా—చుప్ ! దుష్టురాలా ! దాని నెందుకుపిలచుచున్నావు ? అది లోపలకుఁ బోదు.

దాసి—ఇది పాదుషావారియాజ్ఞ. (అనిపలుకుచు దాసి రజియాను లోపలకు లాగికొనిపోవును).

గుల్నా—ఇఁక నేను జీవించియుండు టుచితముకాదు. భర్తచేఁ దిరస్కృతనై—బాంధువులచే నిరాదృతనై, భృత్యులచే ధిక్కృతనై—ప్రేమికునిచే నిరాకృతనై, జీవములతో నుండఁజాలను. ఈబ్రతుకు నాకు మిక్కిలి దుర్భరముగ నున్నది. ఆత్మహత్యఁ గావించుకొని పరలోకమున కేగి సుఖముండెదను.

[గుల్నారుతనయుఁడగు కామబఖ్షా ప్రవేశము]

కామ—అమ్మా ! నాన్నగారి యాదేశమున నేను బిజాపురమునకుఁ బోవుచున్నాను. సెల వొసంగుము.

గుల్నా—ఔను. ఈసమాచారమును నే నిదివఱకే తెలిసికొంటిని. భగవంతుఁడు నీకు మేలుచేయుఁగాక ! ఇదియ నీకు నా యాశీర్వాదము. తిరిగి నీవు నన్నుఁజూడఁజాలవు. (కన్నీరుఁగార్చును)

కామ—తల్లీ ! నీమాటలు నాకు బోధపడలేదు.

గుల్నా—ఏమియును లేదు, నాయనా ! అన్యమనస్కనై యుంటచే నీతో నేమేమో పలికియుంటిని. పొమ్ము ! నీవు నాసమ్ముఖమున నుండుకొలఁది నాదుఃఖము ద్విగుణీకృత మగును.

(కామబఖ్షా నిర్గమించును)

[పిదప గుల్నారుసైత మొకగదినిజొచ్చి, శుభ్రవస్త్రాలంకృతయై మరలివచ్చును.]

ఔరంగజేబు—[ప్రవేశించి] సాకూ...

గుల్నా—ఓహో! పాదుషావారికి గుల్నారుపై ననుగ్రహ ముదయించెనా యేమి?

ఔరం—సామ్రాజ్ఞీ! నీవు నాయెడలనొనర్చిన దోషములకు నిన్ను క్షమించి, పుణ్యక్షేత్ర మగు మక్కాకుం బోవుచున్నాను. నాసర్వనాశనమునకు కారణభూతవగు నిన్నింకఁ బ్రేమింపఁ జాలను. ఇంకనైన నీవు పశ్చాత్తాపము నొంది, భగవంతుని చింతించి, పుణ్యలోకమును చేరుకొనుము.

గుల్నా—నన్ను 'సామ్రాజ్ఞీ' యని సంబోధింపకుఁడు. నా నేరములకు తగినశిక్ష ననుభవించుదానను నేనుకాని మీరు కానేరరు. నేను పశ్చాత్తాప మొందను. స్త్రీనై జన్మించినందులకు పురుషుని నాయిచ్ఛకువచ్చినట్లు స్వాధీనపఱచుకొంటిని. సామ్రాజ్ఞినైనందులకు మొగల్ సామ్రాజ్యము నేలియుంటిని. అంతకంటె నాకు కావలసిన దేమికలదు? కాని, ఆదీర్ఘ కాయుఁడు—నేనుప్రేమించిన దుర్గాదాసుమాత్రము నన్ను జయింపఁగలిగెను. ఆ పరాజయమును సహింపఁజాలక, నాత్మహత్య కావించుకొనుటకై విషపానముఁ జేసితిని. ఇఁకే—నే— బ్రి—తు— —(నేలఁగూలును.)

ఔరం—పాపాత్మురాలా! చచ్చుటకుపూర్వ మొకక్షణమైనను, పశ్చాత్తాప మొంది, ఈశ్వరుని తలంచవైతివే. నీకు నరక ప్రాప్తియే యగును.

(నిష్క్రమించును)

## షష్ఠదృశ్యము

స్థానము:—జయసముద్రతీరస్థమగు రాణాజయసింహుని భవనము.

[భవనబహిర్వేదికపై నధివసించి, దుర్గాదాసు ప్రకృతి సౌందర్యము నాలోకించుచుండును.]

[జయసింహుఁడును, సరస్వతియు లోపలి నుండివచ్చి, దుర్గాదాసునకు వందన మాచరించి] దేవా! ఫలాహారమునుచేయ లోనికి దయసేయుఁడు.

దు—అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను.

జయ—మహాత్మా! మాగృహమున మీకెట్టి యభ్యంతరము నుండదు. ఇచ్చట మీ రామరణము సౌఖ్యముగ నుండవచ్చును. మేము మీకు సేవలొనర్ప సంసిద్ధులము.

[ద్వారపాలుఁడు ప్రవేశము.]

ద్వా—మహారాణా! రాఠొరుసేనాపతి సందర్శనము నభిలషించి మొగల్ సేనాపతియగు దిలేరుఖానుఁ డేతెంచియున్నాఁడు.

దు—(ఆశ్చర్యసూచకముగ) దిలేరు వచ్చియున్నాఁడా! సాదరముగ నతనిఁ దోడ్కొని రమ్ము!

ద్వా—చిత్తము.

(నిష్క్రమించును.)

దు—రాణా! దీనియర్థ మేమై యుండును?

[దిలేరు ప్రవేశించును.]

దిలేరు—బందగీ వీరాగ్రేసరా! బందగీ– నన్ను మఱచుట లేదుగదా?

దుర్గా—నాప్రాణదాతను నేను మఱతునా? దయసేయుఁడు. మీరాకకుఁ గతం బెఱింగింపుఁడు.

దిలేర్ — పుణ్యతీర్థసందర్శన మొనరింప నేతెంచియున్నాను. కాశీ ప్రయాగాదిక్షేత్రముల దర్శించుటచే హిందువు లెట్లు పావనులగుచున్నరో, మరణించుటకుఁ బూర్వము, నేనుసైత మ ట్టి నుదారపురుషులగు మీదర్శనముఁ జేసికొని పావనుఁడ నగుటకు వచ్చియున్నాను.

దుర్గా — దిలేర్! సామాన్యుఁడనగు నన్ను మీ రట్లు భావించుటకు, మీకు నాపైఁ గలప్రేమయె ముఖ్యకారణము.

దిలేర్ — అట్లనఁబోకుము. ఈకలియుగమున మీవంటి మహాత్ముల సందర్శనమే ప్రజలఁ బావనులఁ జేయఁగలుగును. దీనికిఁ బురాణములు ప్రమాణములు.

దు — సేనాపతీ! పురాణములే కాదు. మీవాఁడగు కాసిమే యిం దులకు ప్రత్యక్షప్రమాణము. ముసల్మానుఁడైనను, విశ్వా సముతోఁ జావునకు భయమొందక, మేముచేయు ప్రతికార్య మందును, సహాయభూతుఁడై ప్రవర్తించిన కాసిమును నే నె న్నటికిని మరువను.

[కాసిం ప్రవేశము.]

కా — బందగీ, దుర్గాదాస్!

దు — రమ్ము! ఈస్థలము నాకప్రియము. మన మహారాజు క్షేమ ముగ నున్నారా? వింత లేమైనఁ గలవా?

కా — మన మహారాజును గురించి నన్నుఁ బ్రశ్నింపకుఁడు. ఆదుష్టు నామోచ్చారణమున పాపము సంభవించును. ఔరంగజేబ పాదుషా దౌలతాబాదులోఁ బరలోకప్రాప్తి నొందినాఁడు అతఁడు మరణించుచు "మరాఠులారా! రాజపుత్రులారా!

నన్ను క్షమింపుము. క్షమింపుము”అని కేకలిడి ప్రాణములఁ బాసెను.

(అందఱును కొంతవఱకు మౌనము వహించియుందురు.)

దుర్గా — ఆతనిమరణమునకుఁ గారణము ?

కాసిం — అంతఃపురమునుండి క్రిందికి దిగుచు, కాలుజాఱి, ధరాతలమునఁబడి మరణించెను.

దుర్గా — ఇంతటితో మొగల్ మరాఠ రాజస్థానములు విధ్వంసములయ్యెను. హిందూముసల్మానుల యైకమత్యమునకును, ఆర్యభూమి నుద్ధరించుటకును, మేము చేసిన ప్రయత్నములన్నియును వితథములైనవి. మరల నార్యావర్తనమున రాజపుత్రుల కౌన్నత్యము సంప్రాప్తించునని నేను విశ్వశింపను.

జయ — కాసిం! పాదుషాయనంతరము సింహాసన మెవరికిఁ జెందును?

కాసిం — అజిం ముఅజిము లందులకే పోరాడుచున్నారు. ఢిల్లీ పాదుషా యెవరుకాబోవునదియు నీయుద్ధమునందు తెల్లమగును.

జయ — సేనాపతీ ! కాసిం ! భోజనమునకు వేళయైనది. మేము లోనికిఁ బోవలయును. దయయుంచుము. ఈదుర్గాదాసుని నాటకమున కిదియే భరతవాక్యము.

(దిలేర్ ఖాను, కాసిము లతనికి సలాముల నర్పించి నిష్క్రమింతురు.)



# THIS CANCELS ALL PREVIOUS RULES.

*Estd in 1911.*

**Registered.**

Not this.




TRADE MARK.

భాగవతుల
నరసింహశర్మ
ప్రొప్రైటర్
వేగుంజుక్క
గ్రంథమాల,
పూడిపెద్దివారివీధి,
బరంపురం (గంజాం)

**1927**

సంపాదకులు:—బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు.

## నిబంధనలు.

**1.** నిరూపకనవలలు, సాంఘికనవలలు, ప్రణయచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహర నాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముతో, రమ్యమగు అచ్చుతో, మూడు మాసముల కొకొక్కటిగా వెలువడును.

2 గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్కరూపాయికి వి. పి. చేయబడును. ప్రతిగ్రంథమునకగు పోష్టునకైన ఖర్చులు ప్రత్యేకము. ఇతరులకు ప్రతిగ్రంథము రూ 1—8—0 పోష్టేజి ప్రత్యేకము.

**3.** *నాలుగు గ్రంథములు (పోష్టేజీలుగాక) సంవత్సరమునకు నాలుగు రూపాయలుమాత్రమే. ఈనాలుగు రూపాయలు ముందు (అడ్వాన్సుగా) బంపు చందాదార్లకు పోష్టేజి మేమే భరించి పంపుదుము. ఇందువలన చందాదార్లకు నాలుగు గ్రంథములపై రూ 1—12—0 లాభము కలిగివచ్చును. చాలమంది యిట్టిలాభమును బొందుచున్నారు

**4.** చందాదారులగువారు వెనుకటి గ్రంథములలోనే యొక గ్రంథమునైనం గోరరేని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే. అట్లుకాక, దాను ప్రవేశించిన పిమ్మట నుండి గ్రంథములం బంపగోరరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే.

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన మింతమాత్రమును లేదు. వారు కోరరేని (కోరినగ్రంథములబట్టి) చౌకగా ఇచ్చెదము.

**6.** అప్పుడప్పుడు వెలువడు అనుబంధ గ్రంథములు చందాదార్లకుమాత్రమే యుచితము.

---

* సంవత్సరమునకు 6 గ్రంథములు ప్రకటింప ప్రయత్నములో నున్నారము.

# గ్రంథరచనా నియమములు.

1. Characterisation 2 Development of character 3. New Ideas 4. Historical Beauties 5. Description of nature and other varieties

గమనింపుడు — చందాదారులు ప్రతిగ్రంథముం బుచ్చుకొనుట తమకు విధియై యున్నది తీసి పంపించినపిమ్మట గ్రంథము నెంతమాత్రము త్రిప్పివేయరాదు. ప్రతి గ్రంథమునకు ముందు ఇంటిమేషను పంపుదుము. ఇష్టములేనివారు వెంటనే మాకు దెలియఁజేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధ ముచితముగా పంపుదుము. అడ్వాన్సు పంపిన పోస్టేజిఖర్చు లుండవు.

## నూతనప్రచురములు. (New Publications)

## శ్రీ తులసీరామాయణము.

నిర్వచనము:—చిత్రపటశోభితము.

వాల్మీకి రామాయణమువలెనే హిందూదేశమునందంతటఁ బ్రఖ్యాతిఁగాంచిన రామాయణమిది. మనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయఁబడినది. బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది. జగద్గురుఁడగు శ్రీగాంధిమహాత్మునిచే నిత్యముఁ బారాయణము జేయబడు నీరామాయణ ప్రాశస్త్యముఁ జదివినవా రనేకవిధములఁ గొనియాడక పోరు. వివిధరసములకు, సుపాఖ్యానములకు, మనోహరగాథలకు నిది జన్మసీమ. ఒక్కొక్క కాండము చొప్పున వెలువడును. ఆంధ్రీకృత శ్రీతులసీరామాయణముఁ బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములు మునుమున్న ప్రచురింపఁబడును. బాలకాండము వెలువడినది. కొలఁది ప్రతులుమాత్రము కలవు అయోధ్యాకాండము రెండుభాగములు ప్రతిసంపుటము చందాదారులకు రూ 1—0—0 ఇతరులకు రూ 1—8—0 పోస్టేజి ప్రత్యేకము.

## ఉగ్రభైరవము.

చందాదార్లకు రు 1—0—0 పోస్టేజి వేరే. ఇతరులకు రు 1—8—0 పోస్టేజి వేరే.

గ్రంథకర్త:—పోడూరి రామచంద్రరావుగారు, బి, ఏ బియెల్.

ఇదియొక భయంకరమైన డిటెక్టివ్ నవల. ఆంగ్లమున గల "The Hound of the Baskervilles" అను నవల ననుసరించి మృదుమధుర శైలిని వ్రాయఁబడినది. చిత్రపటశోభితము. హంతకుఁడొక జాగిలముద్వారా చేయించిన యత్యద్భుత భయంకర ప్రక్రియ లిందు నిరూపింపఁబడినది. తుదివరకుఁ జదువనిదే విడిచిపెట్టరు. గుండెలవియఁజేయుచున్నాయి. వలయువారు వెంటనే వ్రాయవలెను. కొలదిప్రతులు మాత్రమే కలవు.

# సర్వమంగళ.

చందాదార్లకు రు 1-0-0] [ఇతరులకు రు 1-8-0 ఎల్లరకు పోస్టేజి ప్రత్యేకము.

గ్రంథకర్త:—వారణాసి నరసింహారావుగారు.

ఇదియొక సరసమైన సాంఘికనవల, అరుంధతీదయావతుల పరోపకార పారీణత, సుశీలాసర్వమంగళల భయంకరకష్టములు. కామినీభీషణ ప్రతిహింస, డాక్టర్ భువనసుందరుని దుర్దాంతదురంత కార్యములు, కామవికార ప్రక్రియలు, చదివితీరవలెను. ఇంతయేల? ఆంధ్రపత్రికాది పత్రికలచే పొగడ్తకెక్కిన నవల యిది. చక్కని నిండు కాలికోబైండు, మంచిఅచ్చు, మంచికాగితము.

# రసపుత్రజీవనసంధ్య.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

బంగాళిభాషయందు శ్రీరమేశచంద్రదత్తుగారిచే వ్రాయఁబడినది. పైగ్రంథకర్తగారిచే ననువదింపఁబడినది. ప్రథమప్రతులన్నియు నరిపోయినవి. ద్వితీయముద్రణమునకు సిద్ధముగానున్నది. వలయువారు వెంటనే తెలియఁజేయవలెను. వెల 0-14-0 పోస్టేజి ప్రత్యేకము.

నాటకత్రయము—గ్రంథకర్త—భా॥ నృ॥ శర్మ॥

# 1 విజయ విజయము.

వీరరసప్రధానమగు నాటకము కర్ణార్జునుల యుద్ధము. ఎల్లరు భారతముఁ జదివినవారే కాని కర్ణుడెట్టివాఁడో యెఱింగినవారు లేరు. కర్ణునికొఱకే యీనాటకము వ్రాయబడినది అనేకులు కొనియాడిన నాటకమిది వెల రు 0-10-0 పోస్టేజి ప్రత్యేకం

# ప్రతిజ్ఞావిజయరామ రాజీయము

లేక

# 2 విచిత్రవీరబొబ్బిలి

బొబ్బిలియుద్ధనాటకము లనేకములున్నవి. యథార్థములగు సంగతులతో విరాజిల్లు నాటకరత్నమిదియే. విజయరామరాజుగారి రాజనీతికి బొబ్బిలివారి పరాక్రమమునకు నిది యునికిపట్టు. వెంకట్రావు, రంగారావు, పాపయ్య, మొదలగు వీరుల పద్యము లగ్నిహోత్రమును వర్షించును. దీని వెల 0-12-0 పోస్టేజి ప్రత్యేకము. కొలదిప్రతులు మాత్రమే కలవు.

# ప్రతిజ్ఞాచాణక్యము.

శ్రీద్విజేంద్రలాల్ రాయ్‌గారు వంగభాషయందు నాటకగ్రంథకర్తలలో నగ్రేసరుఁడని ప్రఖ్యాతి. ఆతఁడువ్రాసిన నాటకములకు "చంద్రగుప్త" శిరోభూషణము. ఆచంద్రగుప్తనాటకమే యీప్రతిజ్ఞాచాణక్యము. అనేకనాటకములవారు నాటకమాడి ప్రఖ్యాతిగణించిరి. చాణక్యు నెఱుంగఁదలఁచినవారీనాటకముఁ జదివితీరవలెను. దేశభక్తి కిది పుట్టినిల్లు. చందాదారులకు 0-12-0 ఇతరులకు రు 1-0-0 పోస్టేజి ప్రత్యేకం.

# అభినవభర్తృహరి.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈనామముఁబట్టియే యిది భర్తృహరి సుభాషితములం బోలు గ్రంథమని తెలియఁగలదు. శృంగారాది వివిధరసములకు, నీతిభక్తిజ్ఞానవైరాగ్యముల కిది పుట్టినిల్లు. మృదుమధురపద్యములు, చక్కనిశైలి, మంచికాగితము, సొగసైనఅచ్చు. దిట్టమగు నట్టబైండు. కొలది ప్రతులే యున్నవి. దీనివెల 0-10-0 పోస్టేజి ప్రత్యేకము.

# కామాక్షిసరసము.

గ్రంథకర్త:—శృంగారశిరోమణి, నుఁడా వెంకటేశముగారు.

తారాశశాంకవిజయము, బిల్హణీయము, రాధికాసాంత్వనము, మొదలగు శృంగారరసప్రబంధములకంటె నిదిమేలు. ఉపదేశరూపమున శృంగారరసముఁ గుప్రిస్మరింపఁబడినది. నీతిబోధకము, మంచిఅచ్చు చూడసొంపుగనుండును. మత్తేభమాలిక.

మనోహరశైలి వెల 0—1—0 మాత్రమే.

వెలస్వల్పము !!　　　　ఫలమధికము !!!

# పద్మరాగము.

(అద్భుతమైన నిరూపకము.)

గ్రంథకర్త:—బూర్ల వెంకటరమణయ్యగారు. ఆంగ్లేయమునఁగల "Reddle of the purple Emperor" అనునవల ననుసరించి స్వతంత్రముగ వ్రాసిన నవల యిది. పద్మరాగాద్యనర్ఘరత్నములకై జరిగిన యద్భుత సంఘటనములతో నిండియుండును. ప్రసిద్ధికెక్కిన డిటెక్టివ్ నవలలో నిదియొకటి యని యెల్లరచేఁ గొనియాడబడినది.

వెల చందాదారులకు రూ 1—0—0

ఆంధ్రీయాయుర్వేదసమితి

భిషక్ రత్న, సోమయాజుల సుబ్బారావు,

ఆగాపేట, బరంపురం (గంజాం)

# వైక్రాంత రసాయనము.

మూర్ఛ, అపస్మారము ఉన్మాదము, పిత్తవికారములు సమస్తప్రదరములు మృతవంధ్య, గర్భస్రావము, హిస్టీరియా



అను స్త్రీవికారములు, మొదలయినవి ఖండించును, స్త్రీపురుషులకు పనికివచ్చును 40 రోజులకు పనికివచ్చునది రు 15—0—0

# విలాసినీవల్లభ రసాయనం.

వృద్ధులను యువ్వనులుగను, బలహీనులను బలవంతులుగను చేయును. ప్రాణాధారమైన రక్తమును శుద్ధిపరచి వృద్ధిచేయును. ఇప్పటి కాలములో ననేకులు దురభ్యాసమునకు లోనై వ్యభిచారదోషమువలన శరీరదార్ఢ్యము తప్పి రోగములపాలై కష్టముల నొందుచున్నారు. ఇదిగాక ఇట్టివారికి పుట్టిన బిడ్డలు దుర్బలులై క్షీణించుట కూడ చూడగలిగితిమి. పై కారణములచే కంటిచూపు చెడి, స్వప్నములచే బాధపడువారు, సంతానహీనులైన వారి ననేకులనున్ను, నరములబలము, ఇంద్రియపటుత్వము లేక బలహీనులైన యువకుల నెందరినో మా వైద్యపరిశోధనభవనములో చూచి చికిత్స చేయగలిగితిమి.

